22.4.1994 శుక్రవారం, 12 పేజీలు, సంపుటి: 65, సంచిక: 16, విడిప్రతి: రు. 2.00 లు

Regd. No. HNL. 18

# జమీన్‌రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి.



# రెడ్డి రాజ్యం విమర్శకు పివి విరుగుడు మంత్రం!

వచ్చే సాధారణ ఎన్నికలను దృష్టిలో పెట్టుకొని సొంత రాష్ట్రాన్ని చక్కదిద్దుకునే కార్యక్రమంలో ప్రధానమంత్రి పి.వి.నరసింహారావు నిమగ్నమై వున్నారు. కోట్ల విజయభాస్కర రెడ్డి అధికారంలోకి వచ్చి ఏడాదిన్నర కావస్తోంది. ఈ ఏడాదిన్నరలో ఆంధ్రప్రదేశ్ "సమస్యల కొరివిగా " తయారైంది. అటు ప్రభుత్వపరంగా, ఇటు పార్టీపరంగా చూసినా గర్వించదగిన మైలురాళ్లు ఏమీ లేకపోగా సమస్యల చాంతాళ్లు మాత్రం గట్టిగా పెనుకపోతున్నాయి. ప్రభుత్వ పరంగా చూస్తే ముఖ్యమంత్రి ఇంతవరకు రాష్ట్ర అధికార యంత్రాంగం మీద "పట్టు" సాధించిన దాఖలాలు లేవు. ఏ జిల్లాలో ఏం జరుగుతుందో ముఖ్యమంత్రికి తెలీటం లేదు. తన చేతిలో సమాచార, పోలీసు, ఇంటలిజెన్సు వంటి శక్తివంతమైన సాధనాలు వుంచుకొని కూడా ముఖ్యమంత్రి ఎందుకో ఆసక్తి చూపటం లేదు. ఒక్క కర్నూలు జిల్లా

## కాపులకు పిసిసి పట్టం

మీద మాత్రమే ఆయన దృష్టిని కేంద్రీకరించారు. వచ్చే ఎన్నికల్లో జిల్లాల వారీగా పార్టీ అభ్యర్థుల్ని ఎలా గెలిపించుకోవాలి ? ఆయా జిల్లాల నాయకుల సహాయ సహకారాలు ఎలా తీసుకోవాలి ? పార్టీలో చూస్తే కొట్టుకు చస్తున్నారు. ముఠా తగాదాలు తారా స్థాయికి చేరుకుంటున్నాయి. ఈ పరిస్థితుల్లో రాజకీయ శక్తుల్ని సమీకరించి ఒక తాటి మీదకు నడిపే మంత్రాంగం ఏదీ విజయ భాస్కరరెడ్డి దగ్గర వున్నట్లు లేదు. అధికార అల్లావుద్దీన్ దీపం ఆయన దగ్గర వున్నా దాన్ని నిమిరి ఉపయోగించుకోవాలన్న ఆసక్తి ఎంతమాత్రం లేదు. ఏదో జరిగి పోతోందిలే, రేపు ఎన్నికలు మాత్రం ఆగిపోతాయా ? అన్న ఉదాసీనత ముఖ్యమంత్రిని ఆవరించింది. ఇక పార్టీ పరిస్థితి చూస్తే ' మజ్జిగ' పలచన అన్నట్లుంది. పిసిసి ఆఫీసుని తులసీదాస్ హైకమాండ్ ఆదేశాలు

కొరవ 10 పేజీలో

# నిజాయితీకి మారు పేరైన నువ్వుల మనకిక లేరు!



రాపూరు శాసన సభ్యుడు నువ్వుల వెంకట రత్నం నాయుడు గారు మరణించారు. 19 తేది అర్ధరాత్రి తిరుపతిలోని శ్రీ వెంకటేశ్వర సూపర్ స్పెషాలిటీ ఆస్పత్రిలో తుది శ్వాస విడిచారు. ఆయన వయస్సు 57 సంవత్సరాలు.

గత ఆరు నెలలుగా మృత్యువుతో పోరాడు తుండినారు నాయుడు గారు. తొలుత పక్షవాతం వచ్చింది. దాని నుంచి కోలుకున్నారు. తర్వాత మెదడులోని నరాలు పని చేయడం మానేశాయి. ఎన్నెన్నో ప్రయత్నాలు చేశారు. నవంబరు 16 తేది నుంచి ఐదు నెలల పాటు ఆస్పత్రి పడక మీదే వుంచారు. ముఖ్యమంత్రి శ్రీ విజయ భాస్కర రెడ్డి ఒకటి రెండు సార్లు హైదరాబాదు నుంచి ప్రఖ్యాత న్యూరాలజిస్టులను

కొరవ 10 పేజీలో

జనార్దన రెడ్డితో సయోధ్య పథకంలో బలిపశువు?

# యానాది రెడ్డికి 'విశ్రాంతి' కల్పిస్తాడా ముఖ్యమంత్రి?

రాష్ట్రంలో ఉప ముఖ్యమంత్రిని నియమించే పక్షంలో కర్నాటకలో జరిగినట్లు మంత్రి వర్గంలో మార్పులు - చేర్పులకు అనుమతి ఇవ్వాలని ముఖ్యమంత్రి కి కోట్ల విజయ భాస్కర రెడ్డి పట్టు పడుతున్నారు. బలహీన వర్గాల వారికి ఉపముఖ్యమంత్రి పదవి ఇవ్వాల్సిందిగా ప్రధాన మంత్రి ఎప్పటి నుంచో పోరు పెడుతున్నారు. మంత్రి వర్గంలో మార్పులు, చేర్పులు చేసుకోవటానికి కర్నాటక తరహాలో తనకు స్వేచ్ఛ నివ్వాలని ముఖ్యమంత్రి షరతు విధించారట. ఈ విషయాన్ని మరో మారు చర్చిద్దామని ప్రధాని మాట వేసినట్లు తెలిసింది. ఈ నెల మూడోవారంలో కోట్ల తిరిగి ప్రధానితో సమావేశ మవుతున్నారు. సమావేశంలో వర్గాలు ఓ కొలిక్కి వస్తే నెలాఖరులో మంత్రి వర్గంలో మార్పులు, చేర్పులతో పాటు ఉప ముఖ్యమంత్రి నియామకం కూడా జరగవచ్చు.

కల్తీ సారా కేసులో రవీంద్రా రెడ్డితో పాటు మంత్రి వర్గం నుంచి తొలగించిన జె.సి. దివాకర రెడ్డిని మంత్రి వర్గంలో చేర్చుకోవాలని కోట్ల భావిస్తున్నారు. మంత్రి వర్గం నుంచి వైదొలగిన దివాకర రెడ్డిని అధికార నివాసం ఖాళీ చేయవద్దని, త్వరలోనే తిరిగి మంత్రి వర్గంలో తీసుకుంటానని గతంలోనే దివాకర్‌కు తాను ఇచ్చిన హామీని నిలుపు కోవాలని భావిస్తున్నారు. అయితే ఇప్పటికే రెడ్డి కులస్తులు మంత్రివర్గంలో అధికంగా వున్నారన్న విమర్శ దృష్ట్యా ఒక రెడ్డిని తొలగించాలన్న ఆలోచన వుంది. ప్రస్తుత పరిస్థితుల దృష్ట్యా ఉద్వాసన నెల్లూరు నుంచే ప్రారంభం కావచ్చు. జనార్దన రెడ్డితో సత్సంబంధాలకు ముఖ్యమంత్రి పచ్చ జెండా ఊపుతున్నారు. ఈ నేపథ్యంలో సయోధ్యకు మార్గం సుగమం అయ్యేందుకు వీలుగా కావలి యానాది రెడ్డిని మంత్రి వర్గం నుంచి తొలగించ వచ్చని అనుకుంటున్నారు. యానాది రెడ్డి పని తీరు పట్ల ముఖ్యమంత్రి సంతృప్తికరంగా లేరు. యానాది రెడ్డిని వదిలించు కోవాలన్న నిర్ణయానికి ముఖ్యమంత్రి ఎప్పుడో వచ్చినప్పటికీ సమయం కోసం వేచి చూస్తున్నారు. యానాది రెడ్డిని తొలగించి దివాకర్‌ను మంత్రి వర్గంలో చేర్చుకోవటం ద్వారా విమర్శకు తావు లేకుండా చేసుకోవాలని ముఖ్యమంత్రి భావిస్తున్నారు. కాగా మహబూబ్ నగర్‌కు చెందిన మంత్రి శంకర రావు, తూర్పు గోదావరి జిల్లాకు చెందిన సంగీత వెంకట రెడ్డి పై తీవ్రమైన అవినీతి ఆరోపణలున్న దృష్ట్యా వారిద్దరిని కూడా మంత్రి వర్గం నుంచి తొలగించాలని ముఖ్యమంత్రి భావిస్తున్నారు. అయితే సంగీతను తొలగించడం అంత సులువు కాకపోవచ్చు. సంగీత కాపు కులస్తుడు కావడమే కాకుండా డాక్టర్ వై.ఎస్. రాజశేఖర రెడ్డికి అత్యంత సన్నిహితుడు. ఇప్పటికే సంబంధాలు బెడిసి వున్న నేపథ్యంలో సంగీతను తొలగించి తిరిగి వై.ఎస్.తో గిల్లికజ్జాలు పెట్టుకోవడానికి ముఖ్యమంత్రి సిద్ధంగా వున్నారా అన్నది అనుమానమే. అలాగే శంకర రావు, కేంద్ర మంత్రి వెంకట స్వామి అల్లుడు. ఇటీవల వెంకట స్వామి కూడా ముఖ్యమంత్రి పని తీరును ఘాటుగా విమర్శిస్తున్నారు. శంకర రావును మంత్రి పదం నుంచి తొలగించడ మంటే వెంకట స్వామితో ఢీ కొనడమే అవుతుంది. మొత్తం మీద ఉద్వాసనలు పెద్దగా లేక పోయినప్పటికీ షెడ్యూలు కులాలు, వెనుక బడిన తరగతుల వారిని నలుగురైదుగురిని మంత్రి వర్గంలో చేర్చుకోవడం ఖాయం.

## దిమ్మెరపోయిన ముఖ్యమంత్రి

వెంగళరావు విమర్శలకు ముఖ్యమంత్రి దిమ్మెరపోయారు. ఆ రకమైన విమర్శలు చేస్తారని ముఖ్యమంత్రి కలలో కూడా ఊహించి వుండరు. వెంగళరావు విమర్శల నేపథ్యంలో మరుసటి రోజు ముఖ్యమంత్రి తన కార్యక్రమాలన్నింటినీ రద్దు చేసుకొని అస్మదీయ మంత్రులతో దీర్ఘంగా సమాలోచనలు జరిపారు. వెంగళరావు వైఖరిపై పి.వి.కి ఫిర్యాదు చేయటంతోపాటు ఆయన వ్యతిరేకుల చేత తిట్టి పోయించాలని వారంతా సలహా ఇచ్చారు. వెంగళరావు తిట్టిపోసే కార్యక్రమం ఇప్పటికే మొదలైంది. పి.వి.కి ఫిర్యాదు చేయాలని ముఖ్యమంత్రి నిర్ణయించారు. వెంగళరావు మాత్రం తాను చేసిన విమర్శల్ని సమర్థించుకుంటూనే త్వరలో మరికొన్ని జిల్లాలకు వెళ్లాలనుకుంటున్నారు. [illegible] త్వరలో పి.వి.ని కూడా కలిసి కోట్లను మార్చాలన్న డిమాండ్ చేయవచ్చని భావిస్తున్నారు.

# 27 తేది పరిశీలకులు వస్తున్నారు!

రాష్ట్రంలో ఎన్నికల రంగం సిద్ధం చేసేందుకు కేంద్ర పరిశీలక బృందం ఈ నెల 27 న రాజధానికి వస్తోంది. నేదురుమల్లి జనార్దన రెడ్డి కమిటీ సిఫార్సుల మేరకు ఆయా నియోజక వర్గాల్లో ఎమ్మెల్యేల మంచి చెడులను పరిశీలించడంతో పాటు పిసిసి, రాష్ట్ర ప్రభుత్వాల పని తీరును కూడా ఈ పరిశీలక బృందం పరిశీలిస్తుందట. పరిశీలకుల బృందంలో జనార్దన పూజారి, ఎ.కె. ఆంటోని, ఖుర్షీద్ ఆలం ఖాన్, మాధవ్ సింగ్ సోలంకి సభ్యులుగా వున్నారు. ఈ బృందం ఇప్పటికే ఢిల్లీలో పలువురు ఆంధ్రా ప్రముఖులతో చర్చించింది. రాజధానిలో వెంగళ రావు, జనార్దన రెడ్డి, వై.ఎస్. వంటి సీనియర్లను కూడా కలుసుకుంటారని భావిస్తున్నారు.

# నా పుట్టలో వేలు పెడితే కుట్టనా?

- వెంగళరావు

చెప్పినంత పని చేశారు వెంగళరావు. అంబేద్కర్ జయంతి రోజు ఖమ్మంలో బ్రహ్మాండమైన బహిరంగ సభ పెట్టి ముఖ్యమంత్రి కోట్ల విజయ భాస్కరరెడ్డిని నోటికి వచ్చినట్లు తిట్టిపోశారు. ముఖ్యమంత్రి ముఠా నాయకుడిలా వ్యవహరిస్తున్నాడని. సొంత కులస్తులను తప్పితే ఇతరుల సంగతి పట్టించుకోవడం లేదని, ఆయన గారి పరిపాలనలో రాష్ట్రాభివృద్ధి గుండుసున్నగా మారిందన్నవి వెంగళరావుగారి ప్రసంగంలోని ప్రధాన ఆరోపణలు. అయితే ముఖ్యమంత్రికి ఈ ఆరోపణలు కొత్తవేమీ కాదు. విజయ భాస్కరరెడ్డి పెద్ద ముఠానాయకుడని తెలుగుదేశం నేతలు ఎప్పుడో దెప్పిపొడిచారు. అయితే ప్రతిపక్షం కాబట్టి ఎవరూ దాన్ని సీరియస్‌గా తీసుకోలేదు. ఆ తర్వాత సొంతపార్టీ ఎంపి డాక్టర్ వైఎస్ రాజశేఖరరెడ్డి కూడా ముఖ్యమంత్రిని ముఠా నాయకుడిగా రచ్చకీడ్చారు. ఆ తర్వాత అదే బాటలో ముద్రగడ ప్రభృతులు కూడా విమర్శలు చేశారు. ఇప్పుడు మళ్లీ వృద్ధ సింహం వెంగళరావు విమర్శల జూలు విదల్చడంతో ముఖ్యమంత్రి ముఠానాయకుడిగా మరోసారి వీధిలో పడ్డారు.

గత నాలుగేళ్లుగా అజ్ఞాతంలో వుంటూ విశ్రాంతి తీసుకుంటున్న వెంగళరావు తిరిగి జనంలో పడటానికి ప్రధాన కారణం ముఖ్యమంత్రే. ఖమ్మం జిల్లాలో వెంగళరావు ప్రత్యర్థి వర్గమైన శీలం సిద్దారెడ్డి గ్రూపుకు ముఖ్యమంత్రి మద్దతునిచ్చి వెంగళరావు వర్గీయులపైకి ఉసిగొల్పారు. వెంగళరావు సొంత మనిషైన కొత్తగూడెం ఎమ్మెల్యే వనమా వెంకటేశ్వర రావును లోబర్చుకొని వెంగళరావు కుటుంబీకులపై విమర్శలు చేయించారు. గత ఏడాదిన్నరగా ఖమ్మం జిల్లాలో వెంగళరావు మనుషుల్ని తరిమి తరిమి కొట్టారు. చివరకు వెంగళరావును అభిమానించే వారికి కూడా చావు- బతుకు సమస్యగా మారింది. దీంతో ఖమ్మం జిల్లా జనమంతా వచ్చి వారి పెద్ద దిక్కు వెంగళరావుపై ఒత్తిడి తెచ్చారు. ఒక రకంగా నిద్రపోతున్న వృద్ధ సింహాన్ని తట్టి లేపారు. సహజంగానే వెంగళరావు మూడో కన్ను తెరిచి ముఖ్యమంత్రిపై విమర్శల వడగళ్లు కురిపించారు. కర్నూలు జిల్లాలో కె.ఇ. కృష్ణమూర్తి ప్రత్యర్థిగా వుంటేనే సహించలేని ముఖ్యమంత్రి ఇతరుల జిల్లాల్లో మాత్రం అక్కడి నాయకులపై ప్రత్యర్థి వర్గాలను దువ్వటంతో వెంగళరావు వంటి వాళ్లు నోరు విప్పక తప్పటం లేదు.విజయభాస్కరరెడ్డి ముఖ్యమంత్రి అయిన ఏడాదిన్నరలో రాజకీయంగా నిలదొక్కుకోకుండా రాష్ట్ర కాంగ్రెస్ నాయకుల్ని బలహీనుల్ని చేసే కార్యక్రమం చేపట్టారు. రాయలసీమలో దివాకరరెడ్డి, మైసూరా రెడ్డిని చేరదీసి వై.ఎస్., రవీంద్రారెడ్డి ప్రభృతుల్ని దూరం చేసుకున్నారు. తను ముఖ్యమంత్రి కావడానికి కారణమైన జనార్దనరెడ్డిని కూడా వదలకుండా నానా ఇబ్బందులు

కొరవ 8 పేజీలో

## మదనపల్లె సబార్డినేటు జడ్జి కోర్టులో

O.S. 58/92

యస్. బాలసుబ్రహ్మణ్యం -వాది

యస్. వెంకట శేషాచార్యులు వగైరాలు -ప్రతివాదులు

సమ్మను

To

| | | | |
|---|---|---|---|
| D1 | S Venkata Seshacharlu<br>S/o. Ramacharlu<br>183, No. 23 Block 5,<br>K.H.P. Quarters<br>East Jayanagar<br>Bangalore | D16 | S. Venkatramanappa<br>S/o. Not Known<br>B. Kothakota |
| D2 | S. Sarangapani<br>S/o. Ramacharlu<br>Badi Kayala Palle<br>B. Kothakota | D17 | C. Pattabhirama Rao<br>S/o. Not Known<br>B. Kothakota |
| D14 | B. Lakshmi Narayana<br>S/o. Venkata Narayanappa<br>Prakash Agarbatthi Factory<br>14th Cross<br>Rangaswamy Temple Street<br>Bangalore | D18 | P. Gurivi Reddy<br>S/o. Not Known<br>B. Kothakota |

పై కనిన నెంబరు దావాలోని వాది ప్రతివాదులు అయిన మీ పై దావా దాఖలు చేసి యుండినందున. దావా లోని 1, 2, 14, 16 to 18 ప్రతివాదులు అయిన మీకు సమ్మను జారీ కానందున వాయిదా తెలుపు నిమిత్తం పై కోర్టు వారు 13.6.94 తేదిన వాయిదా వేసి వుంటున్నారు. సదరు వాయిదా రోజున పుదయం 10 గం. 30 నిముషములకు పై కోర్టు నందు హాజరయి మీకు ఆక్షేపణలున్న యెడల తెలుపుకొన వచ్చును. కానంతట ఎక్స్‌పార్టీగా తీర్మానించబడును.

వాయిదా తే 13.6.94

ఎన్.ఎస్.ఎస్. ప్రసాద్,

వాది పరం న్యాయవాది, మదనపల్లి, చిత్తూరు జిల్లా

# పివి నాన్పుడు వైఖరి

ప్రధాని శ్రీ పివి నరసింహా రావు గారి అనిర్ణయ వైఖరి, నాన్చుడు ధోరణి వల్ల కాంగ్రెస్ పార్టీ ప్రజలలో తరచు చులకనై పోతున్నది. ప్రభుత్వ పరంగా వివిధ మంత్రిత్వ శాఖలు స్వతంత్రించి నిర్ణయాలు తీసు కుంటున్నందు వల్ల ఆయన వాయిదాల అలవాటు పరిపాలనలో ప్రజల అనుభవానికి రావడం లేదు. ఆర్థిక, వాణిజ్య, వ్యవసాయాది మంత్రులు ప్రధానితో సంప్రదిస్తున్నారో లేదో మనకు తెలియదు కాని, వారి నిర్ణయాలు మాత్రం స్వేచ్ఛగా, సత్వరంగా జరిగి పోతున్నాయి. అయితే, అదే విదేశీ వ్యవహారాలు, అంతరంగిక భద్రత, వంటి మంత్రిత్వం శాఖలకు సంబంధించి మాత్రం అపరిమితమైన ఆలస్యం జరుగుతున్నదన్న ప్రచారం ఉంది. హజరత్ బాల్ దర్గా సంక్షోభ సమయంలో దేశం దాన్ని చవి చూచింది. ఇప్పుడు అమెరికా భారత్ పట్ల అవలంబిస్తున్న శత్రు వైఖరి, పాకిస్తాన్‌ను కావలించు కుంటున్న తీరు, బిల్ క్లింటన్ పివిని కలవడానికి చూపుతున్న అదుర్దా వంటి విషయాల్లో ప్రధాని పట్టీ పట్టనట్లు వ్యవహరించడం విదేశీ వ్యవహారాలను నిశితంగా గమనించే వారందరికీ ఆందోళన కల్గిస్తున్నది.

పార్టీ సంస్థాగత వ్యవహారాలలో కాంగ్రెస్ అధ్యక్షుడుగా పివి నరసింహా రావు గారు ఎవరికీ స్వేచ్ఛ ఇవ్వలేదు; ఎవ్వరినీ పూర్తిగా విశ్వసించడం లేదు. ఇందిరా గాంధీ, రాజీవ్ గాంధీల హయాంలో వలెనే ఇప్పుడూ పార్టీ సంగతులన్నీ పూర్తిగా అధ్యక్షుడి చేతిలోనే కేంద్రీకృతమై వున్నాయి. రాష్ట్ర మంత్రి వర్గాలలో మార్పు చేర్పులు, పిసిసి అధ్యక్షులు, ముఖ్య మంత్రుల నియామకం, ఆఖరకు పిసిసి కార్యవర్గాల పునర్వ్యవస్థీకరణలు కూడా పివి నిర్ణయాలకే వదలి వేయబడు తున్నాయి. ప్రభుత్వ వ్యవహారాలలో క్షణం తీరిక లేకుండా, వూపిరి పీల్చుకోను వ్యవధి లేకుండా కాలం గడిపే పివి సహజంగానే వాటి పట్ల మనసు పెట్టలేకున్నారు. నెలల తరబడి నిర్ణయాలు జరగక వివిధ రాష్ట్రాలలో పార్టీ, ప్రభుత్వ యంత్రాంగాలు డోలాయమాన స్థితిలో పడి పోతున్నాయి.

గుజరాత్ విషయమే చూడండి. ముఖ్యమంత్రి శ్రీ చిమన్‌భాయ్ పటేల్ మరణించి రెండు నెలలు దాటింది. ఇప్పటి వరకు అక్కడ నూతన నాయకుడి నియామకం జరగలేదు. పరిశీల కులు వెళ్లి వచ్చారు; శాసన సభ్యుల నుంచి అభిప్రాయ సేకరణలు ఒకటికి రెండు సార్లు జరిగాయి; లెజిస్లేచర్ పార్టీ సమావేశంలో నూతన నాయకుడి ఎంపిక బాధ్యత పివి స్వేచ్ఛకు వదిలేస్తూ తీర్మానించి నెలన్నర దాటింది; పివియే స్వయంగా ఆ రాష్ట్రం వెళ్లి వచ్చారు; అయినా ఇప్పటికీ ముఖ్యమంత్రి పీఠం ఖాళీగానే వుంది. ఆపద్ధర్మ ఏర్పాటుతో ప్రభుత్వ యంత్రాంగం కుంటి నడక నడుస్తున్నది. ముఖ్య మంత్రి పదవి కోసం ఆరాట పడిన మాధవ సిన్హ్ సోలంకి, ఉర్మిళా బెన్ పటేల్ వంటి సీనియర్ నాయకులు ప్రధానితో విసిగి పోయి తమకా పదవే వద్దని, పోటీ నుంచి తాము విరమించు కుంటు న్నామని ప్రకటించారు. కార్యకర్తలూ నిరుత్సాహ పడి పోయారు. ఆఖరకు దినపత్రికలు కూడా ఓర్పు నశించి, కొత్త ముఖ్య మంత్రి గురించి వూహా గానాలు చేయడం మానేశాయి. ఏ క్షణంలో కుర్చీ దిగి వెళ్లిపోవాలో తెలియక తాత్కాలిక ముఖ్యమంత్రి ఏ ఫైలునూ పరిష్కరించ లేకున్నారు. ప్రభుత్వ పార్టీ యంత్రాంగాలు యావత్తూ స్తంభించి పోయి వున్నాయి. గుజరాత్ అంటే ఆర్థికంగా, వాణిజ్య పరంగా మహారాష్ట్ర తర్వాత అతి ముఖ్యమైన రాష్ట్రం. దేశ భద్రత దృష్ట్యా కీలకమైన ప్రాంతం. అత్యంత వ్యూహాత్మక ప్రాధాన్యత కల్గిన రాష్ట్రంలో రెండు నెలలకు పైగా ప్రభుత్వమన్నదే లేని అనిశ్చిత స్థితి, పరి పాలనలో అస్తవ్య స్తత కొన




సాగడం పార్టీకే కాదు, దేశానికే ప్రమాదకరం. అయినా ప్రధాని ఆ విషయంలో ఒక నిర్ణయానికి రాలేకున్నారు; ఎప్పటికి వస్తారో కూడా అంతు చిక్కడం లేదు.

కర్నాటక పిసిసి రగడ, ఆంధ్రలో పెచ్చరిల్లుతున్న అసమ్మతి జాడ్యం, తమిళనాడులో పార్టీ నాయకుల మధ్య, పార్టీకి జయలలితకు మధ్య జరుగుతున్న పోరాటాలు, పశ్చిమ బెంగాల్‌లో ఫైర్ బ్రాండ్ మమతా బెనర్జీకి, ఇతర సీనియర్ నాయకులకు మధ్య అంతర్యుద్ధం, బీహార్, యుపిలలో నిస్తేజమై పోయి వున్న కాంగ్రెస్ పార్టీ యంత్రాంగాలు, మహారాష్ట్రలో పవార్, గాడ్గిల్, చవాన్ వర్గాల మధ్య ముష్టి యుద్ధాలు ... ఏ రాష్ట్రంలో చూసినా పార్టీ పరిస్థితి అధ్వాన్నంగా, అయోమయంగా, ఆందోళన కరంగా వుంది. ఈ ఏడాది ఆఖరకు పలు శాసన సభల ఎన్నికలకు పార్టీని సమాయత్తం చేయవలసిన అవసరాన్ని దృష్టిలో వుంచుకొని చూస్తే, పార్టీ అధ్యక్షుడి అనిర్ణయ వైఖరి చాలా ప్రమాద కరంగా కన్పిస్తూ, భయ పెడుతున్నది. ప్రధాని ఇప్పటికైనా తన జడత్వాన్ని వదలించుకొని, నిద్ర మత్తు వీడి పార్టీలో చైతన్యం తెచ్చేందుకు ప్రయత్నించ కుంటే రానున్న శాసన సభ ఎన్నికలలో కాంగ్రెస్ చాలా నష్ట పోవాల్సి వస్తుంది. పివి నరసింహా రావు గారికి చెప్పగల వారెవరూ లేరు. అంతరంగికులు, విశ్వాస పాత్రులు, సన్నిహితులు, సలహాదారులన్న వారెవరూ లేరు. ఏదైనా ఆయన విజ్ఞతే. స్వతహాగా ఆ విజ్ఞత ఆయనకు వుంది కూడా. కావలసిందల్లా పూనికే!

# నిరుద్యోగులంటే అందరికీ ఎందుకింత చులకన?

నిరుద్యోగు లంటె అందరికీ చులకన అయి పోయింది. తాజాగా ఇంటర్మీ డియట్ బోర్డు కూడా ఉద్యోగాల ఎరను చూపి లక్షలాది రూపాయలు కైంకర్యం చేసింది. బోర్డులో జూనియర్ అసిస్టెంట్ వుద్యోగాలకై దరఖాస్తులు ఆహ్వానించి 80 రూపాయల రుసుం కూడా వసూలు చేశారు. లక్షకు పైగా అప్లికేషన్లు బోర్డుకు చేరాయి. ఇంతలో ఉపాధి కల్పన శిక్షణ శాఖవారు ఇంటర్మీడియట్ బోర్డ్ వారికి డైరక్ట్ రిక్రూట్‌మెంట్ జరపరాదంటూ ఆదేశాలు పంపారు. రిక్రూట్‌మెంట్ ఎంప్లాయిమెంట్ ద్వారానే జరగాలని తెలపటంతో బోర్డ్ ఇరకాటంలో పడింది. దీనివల్ల లక్షలాదిమంది అభ్యర్థులు సంకటంలో పడిపోయారు. ఈ చిన్న విషయం బోర్డు అధికారులకు తెలియలేదా లేక అభ్యర్థుల నుంచి డబ్బు గుంజాలనే భావనే అర్థం కావటంలేదు. నిరుద్యోగుల జీవితాలతో ఆడుకోవడం సబబు కాదు. నిరుద్యోగుల ఆశలు వమ్ము చేయక, పరీక్షలు నిర్వహించి ఖాళీల భర్తీ కార్యక్రమాన్ని నిర్వహించి నిరుద్యోగులను ఆదుకోవాలి.

వెంకటగిరి - డి.వి.రమణయ్య

## ఎంసెట్ పరీక్షల్లో మైనస్ మార్కులొద్దు!

ఈసారి జరిగే ఎంసెట్ ఎంట్రన్స్ పరీక్షల్లో మైనస్ మార్కుల పద్ధతి ప్రవేశ పెడుతున్నట్లు నిర్వాహకులు ప్రకటించడం దారుణం. విద్యార్థులు ఏదో ఒకటి వూహించి రాస్తున్నందున ఈ పద్ధతి నిరోధించేందుకు నాలుగు తప్పు సమాధానాలకు ఒక పెనాల్టీ మార్కు

## జనవాణి

విధించాలని నిర్ణయించారట. ఈ విధానం మల్టిపుల్ ఛాయిస్ విధానానికే విరుద్ధం. ఏ విద్యార్థి అయినా సబ్జెక్టుకు సంబంధించిన సమాచారం మొత్తం బుర్రలో నిల్వ చేసుకోవడం సాధ్యం కాదు. అందువల్ల విద్యార్థి అవగాహనను సూక్ష్మంగా అంచనా వేసేందుకు నాలుగు సమాధానాలిచ్చి, ప్రశ్నకు దగ్గరగా వుండే దానిని గుర్తించమంటున్నారు. అసలు విద్యార్థి వూహించి సమాధానం వ్రాసాడని ఏ పద్ధతిన నిర్ణయిస్తారు? సమాధానం తప్పు అయినంత మాత్రాన లాటరీ పద్ధతి అవలంబించినట్లా? ఈ కొత్త విధానం విద్యార్థులలో లేనిపోని భయాందోళనలు సృష్టిస్తుంది. ఇప్పటికే పేపర్ లీక్‌లు; కోచింగ్ సెంటర్ల దోపిడీలతో సామాన్య విద్యార్థులు ఈ చదువులను అందుకోలేక పోతున్నారు. మైనస్ మార్కుల పుణ్యమా అని మరింత అడుగంటి పోవడం ఖాయం.

వెంకటగిరి -కె.ఎస్.హరి.

## జలగం వ్యాఖ్యలు అనుచితం!

వయస్సు పైబడే కొద్దీ చాదస్తాలు ఎక్కువవుతాయని వృద్ధ కాంగ్రెస్ నాయకుడు జలగం వెంగళరావు ఇటీవల ముఖ్యమంత్రిపై చేసిన విమర్శలు విన్న తరువాత అనిపిస్తుంది. ఏలూరు సభ పేరిట మంత్రులు కోట్లాది రూపాయలు వసూలు చేసి కైంకర్యం చేశారన్న జలగం, ఖమ్మంలో సభ పేరిట 50 లక్షలు వసూలు చేశారన్న ఏం జవాబు చెబుతారు. ఖమ్మంలో కలప వ్యాపారం చేసుకొంటూ జీవితాన్ని ప్రారంభించిన

కొరవ 11 పేజీలో

21-4-1944

పేజీలు : 6 వెల : 0-1-6

## భారత ప్రజా స్వాతంత్ర్య తపస్వి

### మహాత్ముని అనారోగ్యస్థితి

అగాఖా భవనంలో బందీష్ఠ వుంటూన్న భారత భాగ్యవిధాత, పతిత ప్రజాస్వాతంత్ర్య తపస్వి మహాత్మాగాంధీ అనారోగ్య స్థితిలో వున్నారు.

గత గురువారం నుంచి చలిజ్వరంతో బాధ పడతున్నారట. జ్వరం బాగా తీవ్రతరమయిందట. అయినప్పటికీ ఆందోళన చెందవలసిన అవసరంలేదని, యీ వృద్ధాప్యంలో ఎంత సంతృప్తికరంగా వుండాలో అంత తృప్తికరంగానే ఆయన ఆరోగ్యంవుందని బొంబాయి ప్రభుత్వంవారి తొలి ప్రకటన తెల్పుతోంది. 18 తేది ప్రకటనలో మహాత్ముడు ఆరోగ్యం




కోలుకుంటున్నాడని జ్వరం తగ్గిందని వుంది.

## బొంబాయిలో ప్రళయాగ్ని

1806 మందికి గాయాలు

347 మంది మరణము.

గత శుక్రవారం సాయంత్రం బొంబాయి హార్బరులో లంగరువేసి యుంచబడిన ఒక ఓడలో అగ్ని బయలుదేరి (కారణం తెలియదు) హార్బరు గిడ్డంగులు వగైరాలకు, ప్రక్కనున్న మందుగుండు డిపోలకు అంటుకొని పెద్ద ప్రేలుడు సంభవించింది. మంటలు నలుదిశలు వ్యాపించి, అనేక భవనాలు, స్కూళ్లు, హోటళ్లు వగైరాలెన్నో శిథిలమై పోయినాయి. మంటలు ఆర్పటానికి మూడు రోజులు పట్టింది. 1806 మంది గాయపడ్డారు. వారిలో 347 గురు మరణించారు. శిథిలమైన యిండ్లల్లో యింకా శవాలు కనిపిస్తున్నాయట. రోడ్డు రైల్వేట్రాఫిక్ పెద్ద దెబ్బతింది. విక్టోరియా టర్మినల్స్ రైల్వేస్టేషను ధూరా కొంతగా దెబ్బతిన్నది

### బొంబాయి పత్రిక మూత

ఈ ప్రమాద విషయంలో తనకు చేరిన వార్తలు ప్రకటించలేక మూడు కాలములు ఖాళీగా వదలిన బొంబాయి సెంటినాల్ పత్రికను ప్రభుత్వం మూసి వేయించింది.

## 50 ఏళ్ళ క్రితం ఈవారం

### హోటళ్ల దుర్గతి

హోటళ్ల దుర్గతివలన సాంక్రామిక వ్యాధులు విపరీతంగా పెరిగిపోతవి. పాత్రలు, స్పూన్లు నిమిష నిమిషానికి వేనకు వేల పెదవులు మారుతున్నా వేడినీటితో మరగపెట్టడం ఏహోటల్లో జరగడం లేదు. పదార్థాలు చాలా కల్తీగా వుంటున్నవి. అపరిశుభ్రం విపరీతం. ఈ క్రింది రిపోర్టులు వినండి మచ్చుకకు కొన్ని-

1. "బెంకురోడ్డులో ఒక హోటల్లో దోసెవేసే పెనముపైన చీపురగట్టతో తుడుస్తుండగా నేను చూచాను.

-డాక్టరు రామకృష్ణమూర్తి".

2. " పలానిహోటల్లో 19 తేది మసాలా దోసెలో మూడు కాల్చిపారేసిన సిగరెటు ముక్కలుండినవి. 20 తేది నాడు గూడ అదేహోటలు దోశలో ఒక కాల్చి వేసిన సిగరెట్ ముక్క వున్నది.

-రఘురామయ్య".

కొరవ [illegible] పేజీలో



రోటరీ క్లబ్ నిర్వహించిన ఉచిత కృత్రిమ అవయవాల శిబిరంలో మాట్లాడుతున్న మాజీ రోటరీ గవర్నర్ జివి రెడ్డి, క్లబ్ అధ్యక్షుడు డిసి హరిబాబు, ఇఫ్కో ఛైర్మెన్ పెళ్లకూరు రామచంద్రా రెడ్డి, జెకె రెడ్డి; ప్రక్కన కృత్రిమ కాలు అమర్చుకొని సంతోషంగా నడచి వెళ్తున్న ఒక బాలుడు.

# సరస్వతీదేవి ఆ పిల్లవాడి నాలుకపై నాట్యమాడింది!

అష్టావధానం ఒక సాహితీ సర్కస్. తెలుగు సాహితీలోకానికే పరిమితమైన అద్భుత ప్రక్రియ. కవిత్వం పైన, భాషపైన తిరుగులేని పట్టు, ఫోటోగ్రాఫిక్ మెమొరీ, లోకజ్ఞానం, సమయస్ఫూర్తి వంటి వన్నీ సమపాళ్లలో నిక్షిప్తమై వున్నవారు తప్ప సాహసించలేని కవితా విన్యాసం అది. అటువంటి అవధానాన్ని ఒక పద్నాలుగేళ్ల బాలుడు అవలీలగా చేయగల్గుతున్నాడంటే నమ్మటం కష్టం. కాని ఆ సాహసాన్ని ప్రదర్శించి, పండితులనే అబ్బురపరచి, సాహిత్య భీష్మాచార్యుల వంటి బెజవాడ గోపాలరెడ్డి గారి చేత వెన్ను తట్టించుకొన్నారు, దుర్గామల్లికార్జునరావు. తూర్పు గోదావరి జిల్లా ముక్కామలకు చెందిన ఈ పదవతరగతి పిల్లవాడి 17 తేది టౌన్‌హాల్‌లో చేసిన అష్టావధానం నిజంగా ఒక మధురానుభూతి. సరస్వతీ దేవి ఆ పిల్లవాడు నాలుకపై నాట్యమాడుతూ

**పండితులను తబ్బిబ్బు చేసిన పద్నాలుగేళ్ల పసిబాలుడి అష్టావధానం**

నిలబడి పోయిందా అన్పించింది. పృచ్ఛకులందరూ కాలేజి లెక్చరర్లు, పండితులు వేణుగోపాలస్వామి కాలేజి లెక్చరర్ శ్రీమతి వసుంధర మొదటనే

" తల్లీ రమ్మని పిల్చె భర్త నిజకాంతన్ మన్మథ క్రీడకున్" అనే సమస్యా పూరణాన్ని ఇచ్చారు. వయస్సు చిన్నది. సమస్య శృంగార పూరితమైనది. కాని మల్లికార్జునరావు వెనక్కు తగ్గలేదు.

" ఉల్లాసమ్మున ధీవిశిష్టతను తానుత్సాహియై నైపుణి

పుల్సాంచద్రసికుండు
మోదమున శ్రీ పూర్ణంబుగా నాప్తుడై

ఉల్లంబుల్ల సితంబుగాగ
మరులన్ మోహాలసత్ కాంతిమ తల్లీ
"......"

కొరవ 7 పేజీలో

## సణుగుడు

### * నెల్లూరు సీటుకు ఎక్కడ లేని గిరాకీ!

అలూ లేదు, చూలూ లేదు కొడుక్కు పేరు పెట్టినట్లుంది. టుంది - అసెంబ్లీ సీట్లకు అభ్యర్థులను చర్చించడం. కాని వాటికి ఆశ పడే వారి ఆత్రం, ఆరాటం, కక్కుర్తి చూస్తుంటే గమ్మునుండ బుద్ధి కావడం లేదు. మిగతా వాటి సంగతెట్లా వున్నా నెల్లూరు సీటుకు మాత్రం వెంపర్లాడి పోతున్నారు చాలా చాలా మంది! ఆరడుగుల పొడవు ఆజానుబాహుడు జెకె రెడ్డి పచ్చగా వుండగా ఆయన లేనట్లే ఆ సీటును చర్చలోకి తేవడం ఎందుకు జరుగుతున్నదో, ఎవరు చేస్తున్నారో అర్థమే కావడం లేదు. అది జెకె స్వయం కృతాపరాధమా? - కావచ్చు!. జనార్దన రెడ్డి మీద సహేతుక కారణం లేని వ్యతిరేక భావంతో ఆయనకు దూరం, దూరంగా జరుగుతూ, జరుగుతూ వెళ్లి తానుఅందరికీ దూరమై పోయి ఒంటరి వాడై పోయాడు జెకె. జనార్దన వ్యతిరేక ప్రభంజనం సృష్టిస్తామని ఆనాడు చెప్పిన వారు, ఆనక సైగ్గా అదే జనార్దన రెడ్డితో సర్దుక పోయారు. ఆ మాటలు నమ్మిన జెకె మాత్రం కట్టుబడి పోయాడు. మాగుంటతో సాన్నిహిత్యం ఆయనకు రాజకీయంగా లాభించలేదు. రాజకీయం, వ్యాపారం కలగలసిన వారి వ్యూహాలవల్ల స్వతంత్ర స్వేచ్ఛాయుత శక్తిగా ఎదిగే అవకాశం వారికి దొరకలేదు. ఈ పరిణామానికి బలిపశువు జెకె. విజయభాస్కర రెడ్డి ఆయనకు ప్రత్యేకంగా చెవి ఇచ్చి వింటున్నా, పది మందిలో కన్పడితే ప్రత్యేకంగా పలుకరిస్తున్నా అది హైదరాబాదుకే పరిమితమై పోయింది. నెల్లూరు జిల్లా రాజకీయాలలో జనార్దన రెడ్డిని అడగకుండా వేలు పెట్టే ధైర్యం ముఖ్యమంత్రికి లేదు. అక్కడ జెకె వట్టి వాడై పోయాడు. స్వతహాగా పోరాడే

**డోలేంద్ర**

నైజం లేక పోవడం, రాజకీయ ట్రిక్కులు జిమ్మిక్కులు చేసే నైపుణ్యం సంపాదించక పోవడం, మనసులో విషం దాచుకొని పైకి తేనె పలుకులు పల్కే కపటం అలవడక పోవడం, మనసు విరిగితే మళ్లీ ఆ మనిషితో కలవడానికి ఇచ్ఛగించని మంకు పట్టు వీడక పోవడం వంటి లక్షణాలన్నీ కలసి జెకెని రాజకీయంగా ఏకాకిని చేశాయి. వదాన్యత, స్నేహ పాత్రత, సౌమ్య భాషణం, సంస్కారం ఇత్యాదులు స్నేహితుల సంఖ్యను పెంచుతాయే తప్ప రాజకీయానికి అతకని గుణాలు కదా?

జెకె వంటరి తనాన్ని చూసి ఆయన రంగంలో లేనట్లే ఫీలై పోతున్నారు అభ్యర్థులు కాగోరినవారు. నెల్లూరులో ఒకసారి గెల్చిన వాడు మళ్లీ

కొరవ 7 పేజీలో

# వేణుగోపాలుడికి నిత్య కళ్యాణం, బంగారు గరుడ వాహనం!

మూలపేటలోని వేణు గోపాలుడికి పదిహేను లక్షల రూపాయల గరుడ వాహనాన్ని సమకూర్చడంతో పాటు, వచ్చే నెల నుంచి నిత్యకళ్యాణాన్ని కూడా జరిపించనున్నారు. 20 తేది బ్రహ్మోత్సవాల ప్రారంభాన్ని పురస్కరించుకొని విలేఖరులతో ముచ్చటిస్తూ ఈ గోల్డన్ న్యూస్ చెవిన వేశాడు దేవస్థానం మేనేజింగ్ ట్రస్టీ ఆనం వివేకానంద రెడ్డి. బంగారు గరుడ వాహనాన్ని తిరుమల తిరుపతి దేవస్థానం పర్యవేక్షణలో తయారు చేస్తారట. అదే గాక ఐదు లక్షలతో బంగారు కవచాలు చేయించి మరో ఐదు లక్షలతో స్వామి వారి గర్భగుడిలో పాలరాళ్లు పరవనున్నట్లు చెప్పారు.

రామలింగా పురంలో 50 లక్షల రూపాయల ఖర్చుతో 140 అంకణాల విస్తీర్ణంలో కళ్యాణ మండపం కట్టనున్నారు. మరో పది లక్షల రూపాయలతో బాలాజీనగర్‌లో ఒక కృష్ణ మందిరం కూడా నిర్మిస్తారట. దేవస్థానానికి వుండిన120 ఎకరాల భూమిలో ఒక్క సెంటు కూడా అన్యాక్రాంతం కాలేదని వివరించా రాయన. సంవత్సరానికి దేవాలయానికి 9.5 లక్షల ఆదాయం వస్తున్నట్లు తెలిపారు. బ్రహ్మోత్సవాలలో 25 తేది బంగారు గరుడ సేవ, 26 తేది కళ్యాణం జరుగుతుందని చెప్పి ముగించారు

**నెల్లూరు సంగతులు**

వివేకానంద రెడ్డి, నిత్య కళ్యాణాలకు సంతసించి వేణుగోపాలుడు వివేకాను అనుగ్రహిస్తాడో, డైరీ పెట్టిందుకని విసుక్కుంటాడో వేచి చూద్దాం!

### విజయవంతమైన రోటరీ వికలాంగుల శిబిరం

డిసి హరిబాబు నెల్లూరు రోటరీ క్లబ్ అధ్యక్షుడు అయినప్పటి నుండి విరుదల లేకుండా కార్యక్రమాలు చేపట్టి క్లబ్ పునికిని చాటుతున్నారు. గత నెలలో వికలాంగులకు వుచిత కృత్రిమ అవయవాల పంపిణీ శిబిరాన్ని పెద్ద ఎత్తున వారం రోజుల పాటు నిర్వహించారు. వికలాంగులకు ట్రై సైకిళ్లు, వీల్ చైర్లు, క్యాలిపర్స్, క్రచ్చెస్, జైపూరు పాదాలు, చెవిటి వారికి వివిధ పరికరాలు పంపిణీ చేశారు. ఏనుగు పట్టాభి రామిరెడ్డి రోటరీ కాంప్లెక్స్‌లో

కొరవ 8 పేజీలో

### కండ్లేరు ముంపుగ్రామాల్లో సినిమా సెట్టింగ్‌ల వంటి ఇళ్లు

# రైతుల దురాశకంటే అధికారుల అత్యాశదే తప్పు!

ప్రజల ఆశ్యాశ, స్వార్థపరులైన అధికారుల ప్రోత్సాహం బహిరంగమై, కండలేరు ముంపు గ్రామవాసుల పరిస్థితి కోరి కొరివితో తల గోక్కున్నట్లయింది. రాపూరు మండలంలోని గుండవోలు, శిద్ధమల్ల, లింగపాళెం, రేగటపల్లి గ్రామాలలోని పంట పండించే భూములు ముంపు ప్రాంతాలైనందు వల్ల ప్రభుత్వం నష్ట పరిహారం ఎప్పుడో ఇచ్చేసింది. కాని గ్రామాలాలోని గృహాలకు మాత్రం నష్ట పరిహారం చెల్లించక నిలిపి వుంచింది. ఇదే అదనుగా చూసుకొన్న కొంత మంది స్వార్థపరులు గ్రామాలలోని ఖాళీ స్థలాల్లో అంగుళం సైతం వదలకుండా ఇళ్ల నిర్మాణాలు చేపట్టేశారు. కండ్లేరు అధికారులు తమవంతుగా మామూళ్లు గుంజి ఈ ఇళ్లకు నంబర్లు కూడా వేసి సహకారం అందించారు. అతిచిన్న గ్రామమైన రేగటపల్లెలో ఓటర్ల సంఖ్య కంటే ఇళ్ల సంఖ్య ఎక్కువైంది. కేవలం ఐదారు వేలతో రెండు దూలాల పూరిల్లు నిర్మించి 25వేల నష్ట పరిహారానికి ప్రభుత్వానికి దరఖాస్తులు చేశారి గ్రామస్తులు.

ఇటీవల ఈ విషయమై పెద్ద ఎత్తున దుమారం రేగడంతో జిల్లా కలెక్టర్ ఎం. సాంబశివరావు, జాయింట్ కలెక్టర్ సతీష్‌చంద్ర గతవారం ఈ ముంపు గ్రామాలను సందర్శించారు. సినిమా సెట్టింగుల వలె కొత్తగా వెలసి వున్న కట్టడాలను చూసి ఆశ్చర్యపోయారు. కొత్త ఇళ్లను ఎవరికివారే పీకేయకుంటే ఏ ఒక్కరికీ నష్టపరిహారం చెల్లించమని కలెక్టర్ ఆగ్రహంతో చెప్పారు. నష్టపరిహారం చాలకుంటే ప్రభుత్వానికి విన్నవించుకోవాలి గాని ఈ విధమైన

## జిల్లావార్తలు

దొంగ వ్యవహారంతో మోసం చేయదాన్ని ఒప్పుకొనేది లేదన్నారాయన. కొత్తగా వెలసిన కొల్లప నాయుడు పల్లి గ్రామాన్ని పరిహారపు గ్రామాల జాబితా నుండి తొలగించారు కలెక్టర్. అక్రమ ఇళ్ల నిర్మాణానికి పర్సంటేజీలు ఆశించిన తెలుగు గంగ అధికారులే దీనికి కారణమని తెలుస్తుంది. ఖాళీస్థలాల్లో ప్రజలు ఇళ్లు వేయకున్నా సదరు స్థలాలకు నంబర్లిచ్చి, తమ జేబులు నింపు కున్నారీ ఘనత వహించిన అధికారులు. ప్రస్తుతం కలెక్టర్ ఆగ్రహించిన తరువాత ఇంటి నంబర్లు తుడపను వెళ్లిన అధికారులను తామిచ్చిన మామూళ్లు ఇవ్వమని ప్రజ.. నిలదీస్తున్నారు. ఈ వివాదం ఎక్కడ తెగుతుందో తెలియని పరిస్థితి ముంపు గ్రామాల్లో వుంది. కొత్తగా కట్టిన ఇళ్లను కూలద్రోయను వెళ్లిన బుల్ డోజర్లను పోలీసులను ప్రజలు అడ్డగించారు. పేలేందుకు సిద్ధంగా వున్న అగ్నిపర్వతాలను పోలి వున్నాయి ప్రస్తుతం ఈ ముంపు గ్రామాలు.

### అధ్వాన్నానికి ప్రతీక కలిచేడు పంచాయితీ

అధ్వాన్నానికి ప్రతీకగా కలిచేడు గ్రామ పంచాయితీని అభివర్ణించ వచ్చు. మైకా పరిశ్రమకు పేరు గొప్పనే గాని ఊరు దిబ్బగానే నిలిచి వుంది. పంచాయితీ శానిటరీ అధికారులు ఏనాడూ వీధులను శుభ్రం చేసిన పాపాన పోరు. చెత్త, చెదారంతో గ్రామమంతా సుందర ముదనష్టంగా వుంటుంది. కాల్వలు పూడ్చక పోవడం వల్ల పందుల స్వైర విహారానికి అడ్డేలేదు. వీధి దీపాలు వెలిగే రోజు ఆరునెలల కొకపూటే. భారీగా రోజ్‌గార్ నిధులు మంజూరైనా అభివృద్ధి పనులన్నీ అధికారుల నిర్లక్ష్యం మూలంగా అసంపూర్తిగా నిలిచిపోయి వున్నాయి. ప్రాథమిక అవసరమైన మంచి నీటి సౌకర్యం కల్పించడంలోనూ పంచాయితీ అధికారులు విఫలమై పోయారు. బావి త్రవ్వి, షెడ్ కట్టి సరిపెట్టుకున్నారు తప్ప మోటారు బిగించడానికి ముహూర్తం దొరికినట్లు లేదు. జిల్లా పంచాయితీ అధికారి ఒకసారి గ్రామాన్ని సందర్శించి కనీస సౌకర్యాలు మెరుగు పర్చాలని ప్రజల కోరిక. ఆయనకు తీరికుందో లేదో?




వర్ధమాన సమాజం నిర్వహించిన అష్టావధానంలో అత్యద్భుత ప్రతిభ ప్రదర్శించిన పద్మాలుగేళ్ల బాలుడు దుర్గా మల్లికార్జున రావును సత్కరిస్తున్న బెజవాడ గోపాల రెడ్డి. ప్రక్కన సమాజం కార్యదర్శి బివి నరసింహులు

### వెంకటగిరి ట్రెజరీలో పరాబు లేదు!

వెంకటగిరి సబ్ ట్రెజరీలో మూడు సంవత్సరాలుగా పరాబు లేక పోవడం వల్ల పెన్షనర్లు పడరాని పాట్లు పడుతున్నారు. సామాన్యంగా 1 తేది నుండి 15 తేది వరకు పెన్షన్లు, ప్రభుత్వం చెల్లించే కొన్ని పద్దుల మొత్తం, ట్రెజరి కార్యాలయం చెల్లించడం ఆనవాయితీ. 1 తేది నుండి 5 తేది వరకు పెన్షనర్లతో ట్రెజరి కార్యాలయం కిట కిట లాడుతుంటుంది. జిల్లాలో నెల్లూరు, గూడూరు, కావలి తరువాత వెంకటగిరిదే పెద్ద ట్రెజరీ. నెలకు 350 మందికి పైగా వుద్యోగులు పెన్షన్ల కోసం వస్తారు. పరాబు లేక పోవడం వల్ల తీరికున్న ఏదో ఒక వుద్యోగి ఈ పనులు చూస్తుండడం వల్ల పెన్షనర్లు ట్రెజరీ చుట్టూ కాళ్లరిగేలా తిరగాల్సి వస్తున్నది. జిల్లా ఖజానాధికారి దృష్టికి ఇన్ని రోజులుగా ఈ సమస్య రాకపోవడం ఆశ్చర్యంగా వుంది!

### రాపూరు పినాకినీ బ్యాంకుకు అవార్డు

అనతి కాలంలో బ్యాంకును అభివృద్ధి మార్గాన పయనింప చేసిన రాపూరు పినాకినీ బ్యాంకు మేనేజర్ రమణారెడ్డికి అవార్డు లభించింది. కండలేరు ముంపు రైతులు పొందిన

కొరవ 7 పేజీలో

# నెల్లూరు నలుచెరగుల్లో
## విహంగముడు

### జనార్ధన రెడ్డి

రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు, మాజీ ముఖ్యమంత్రి శ్రీ నేదురుమల్లి జనార్ధన రెడ్డి, వెంకట రత్నం నాయుడు గారికి శ్రద్ధాంజలి ఘటించను ౨౦ తేది నెల్లూరు వచ్చారు. ఈ రోజు (23 తేది) నుంచి ఆయనకు జిల్లాలో కార్యక్రమాలుండినాయి. శానవపక్ష్మరి మృతికి సంతాపంగా వాటిని రద్దు చేసుకుంటారో, కొనసాగిస్తారో తెలియదు.

### కాన్షీరాం

బహుజన సమాజ్ పార్టీ అధినేత శ్రీ కాన్షీరాం 25 తేది నెల్లూరు వస్తున్నారు. ఏర్పాట్లు విస్తృతంగా జరుగుతున్నాయి. వి.ఆర్.సి గ్రౌండ్స్‌లో సాయంత్రం సమయంలో సభ. జనం వేలం వెర్రిగా రావడం ఖాయం. గాతు లచ్చన్న గారు కూడా కాన్షీరాం తోటి నెల్లూరు వస్తున్నారు.

### సుజాతా రావు

రాష్ట్ర కుటుంబ సంక్షేమ శాఖ కార్యదర్శి, మన జిల్లా మాజీ కలెక్టరు కుమారి కె. సుజాతా రావు 19 తేది నెల్లూరు వచ్చారు. పొదలకూరు, బ్రాహ్మణపల్లి, బిరదవోలు, ఇందుకూరు పేట, కృష్ణాపట్నం, ఆత్మకూరు తదితర గ్రామాలు పర్యటించారు. షారా నిపేరం, పొదుపు లక్ష్మి, రొయ్యల పెంపకం తదితర కార్యక్రమాలు పరిశీలించారు. సుజాతా రావు గారికి నెల్లూరులో ఆత్మీయాను బంధం వుంది. ఆమె ఎక్కడ పని చేస్తున్నా నెల్లూరును మర్చి పోలేదు; నెల్లూరీయులూ ఆమెను మరువరు.

### ఎస్ఐ సస్పెన్షన్

ఇందుకూరుపేట సబిన్స్‌పెక్టర్ ఎన్. సురేష్ కుమార్‌ను అవినీతి ఆరోపణల పై సస్పెండ్ చేశారు. ఎస్పి గారి నిర్ణయం అది.

అవినీతి లేని పోలీసు అధికారి, సబిన్స్‌పెక్టర్లు జిల్లాలో ఎవరైనా వున్నారా? ఎందుకి గొంగళిలో వెంట్రుకల ఏరివేత?

### ప్రమాదాలు, చావులు- గుంటల రోడ్లే మేలా?

టౌన్‌లో రాజేశ్వరి గుడి, ఆర్‌టిసి బస్టాండుల మధ్య ఈ వారంలో ఆరు రోడ్డు ప్రమాదాలు జరిగాయి. ఆదివారం ఉదయం ఫత్తేఖాన్‌పేట సెంటర్‌లో ఒక ఆర్‌టిసి బస్సు సైకిలిస్టును ఢీ కొట్టింది. సైకిల్ పై వెళ్తుండిన వెంగళ రావు నగర్ నివాసి గాయపడ్డాడు.

సోమవారం మధ్యాహ్నం రాజరాజేశ్వరి దేవిని దర్శించుకొని ఆటో ఎక్కుతుండిన కుటుంబ సభ్యులను దిటిప స్కూల్ ఆఫ్ నర్సింగ్‌కు చెందిన వ్యాన్ ఢీ కొట్టింది. ఫత్తేఖాన్ పేటకు చెందిన నై. నరసింహాలు అక్కడికక్కడే మరణించారు. ఆటో డ్రైవర్‌కు తల పై దెబ్బలు తగిలి ప్రమాదకరంగా వుండడంతో మద్రాసుకు తరలించారు. తక్కిన వారిని నెల్లూరు ప్రభుత్వ ఆస్పత్రిలో చేర్పించారు.

గురువారం ఉదయం ఒక లారీ స్కూటర్‌ను తొక్కేసింది; ఒక టౌన్ బస్ లూనా మోపెడ్ పైకి ఎక్కింది; చెక్కేమిట్ట మలుపులో ఒక లారీ అదుపు తప్పి రోడ్డు ప్రక్కనున్న బంకును ధ్వంసం చేసింది.

రోడ్డు రిపేరు చేసి, గుంటలు లేకుండా చేయడం వల్ల వాహనాలకు ఏనుగెక్కి నంత సంబరంగా వుంది. వాయువేగ మనోవేగాలతో పరుగులు పెడ్తున్నాయి. చదునైన రోడ్డు పై ప్రయాణం అలవాటు తప్పిందేమో, ప్రమాదాలు వరుస పెట్టి జరుగు తున్నాయి. నెల్లూరీయుల క్షేమతకు గుంటల రోడ్లే తగినవేమో!

### కోవూరు సిఐ బదిలీ

కోవూరు సర్కిల్ ఇన్స్‌పెక్టర్ శ్రీ కె. రామ మోహన రావును బదలీ చేసి, ఆ స్థానంలో గురజాల నుంచి శ్రీ పి. కోటేశ్వర రావును నియమించారు. కోటేశ్వర రావును కోవూరుకు పాత కాపు; సబిన్స్‌పెక్టర్‌గా పనిచేసి వెళ్లాడు.

### సుందరాచారి వృత్తి విరమణ

నెల్లూరులో సీనియర్ న్యాయవాది శ్రీ మాడభూషి సుందరాచారి వృత్తి విరమణ చేసి, హైదరాబాద్‌కు మకాం మార్చేస్తున్నారు. ఈ సందర్భంగా 30 తేది నెల్లూరు బార్ అసోసియేషన్ వార్షికోత్సవ సభలో వీడ్కోలు సన్మానం చేస్తున్నారు. హైకోర్టు న్యాయమూర్తి శ్రీ దశరథ రామ రెడ్డి, జిల్లా జడ్జి శ్రీ ఇస్మాయిల్ పాల్గొంటారు.



పదవీ విరమణ చేసిన అల్లూరు ఆర్.కె. జూనియర్ కళాశాల ఉపాధ్యాయుడు యేడం మస్తాన్ రెడ్డిని సన్మానిస్తున్న శిష్య బృందం

### రంగనాథ స్వామికి నిత్య కళ్యాణం

రంగనాయకుల పేట శ్రీ తల్పగిరి రంగనాథ స్వామి దేవాలయంలో నిత్య కళ్యాణ సేవ జరుగుతూంది. రు. 350 లు చెల్లించిన భక్తుల పేరుతో కళ్యాణం చేస్తారు. తిరుమల దేవస్థానం నమూనాలో జరిగే ఈ విశిష్ట సేవలో భక్తులు విరివిగా పాలు పంచుకోవాలని ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు విన్నవిస్తున్నారు.

### డేగా యాత్ర

మాజీ జిప్రప ఛైర్మన్ శ్రీ డేగా నారసింహా రెడ్డి త్వరలో ప్రజా సన్నిహిత యాత్ర పేరిట జిల్లా అంతటా పర్యటించ నున్నారు. జిల్లా ఎన్నికల కమిటీలో స్థానం కల్పించక పోయినా, జిల్లాలో ఎన్నికల కోసం కార్యకర్తలను ఉత్సాహ పరిచే బాధ్యత డేగా పై మోపారట ఎన్టీఆర్. నెత్తి మాడ్చే ఎండల్లో వూరురు తిరగ మనడం డేగాకు ప్రమోషనా? పనిష్మెంటా?

### ఇంకెంత కాలం ఎదురు చూపు?

ఒక్కొక్కటి కోటి రూపాయల ఖర్చుతో నిర్మించిన కూరగాయల మార్కెట్, నెల్లూరు విద్యుత్ కార్యాలయాల భవన సముదాయం ప్రారంభోత్సవం కోసం మూడు నెలలకు పై నుంచి ఎదురు చూస్తున్నాయి. ముఖ్యమంత్రిని పిలిపించి రిబ్బను కత్తిరించాలన్నది ఆశ అట. ఆయన రాడు, ఆయన్ను పిల్చి వేరొకరి చేత తలుపులు తెరిపించే సాహసం ఎవరికీ లేదు. ప్రారంభోత్సవాల కోసం ఇన్ని కోట్లు ఖర్చు పెట్టి కట్టిన భవనాలను ఖాళీగా వుంచడం బాగాలేదు. ఏదో ఒక నిర్ణయం తీసుకొని, వాటిని సద్వినియోగం చేయండి.

### ఆనం వెంకట రెడ్డికి అనారోగ్యం

ఆనం కుటుంబానికి పెద్ద తలకాయ, మాజీ మంత్రి శ్రీ ఆనం వెంకట రెడ్డి అనారోగ్యంతో నెల్లూరు అపోలో ఆస్పత్రి చేరారు. రెండు రోజుల క్రితం ఆయనకు స్వల్పంగా గుండె పోటు వచ్చింది. ఎంత నిశ్శబ్దంగా వచ్చిందో, అంతే నిస్సవ్వడిగా సర్దుకున్నది. ఇప్పుడు ఆయాసం తప్ప మరే ఆందోళనా లేదు. ఒకటి రెండు రోజులలో డిశ్చార్జి కావచ్చు. ఆనం వెంకట రెడ్డి గారి కిప్పుడు 85 ఏళ్ల వయస్సు. మొక్కలాగా వున్నారు. ఆస్పత్రిలో చేరే వరకు చలాకీగానే, పూర్తి ఆరోగ్యంతో కన్పించారు. యోగాసనాల బలం ఆయనలో వృద్ధాప్యం కన్పడకుండా చేస్తున్నది.

వెంకట రెడ్డి గారు త్వరలో కోలుకొని సంపూర్ణారోగ్యవంతులై తిరిగి రావాలని భగవంతుని కోరు కుంటున్నాము.

కొరవ 7 పేజీలో



సణుగుడు (4 పేజీ కొరవ)

గెలవడన్న చరిత్ర వుంది. అది కొకు వర్తింపజేస్తే, ఆయన ఇక్కడ పోటీ చేయడం వ్యర్థమన్నది ఒక సిద్ధాంతం. సిఎం గుడ్‌లుక్స్‌లో వున్నాడు ఇరుగు, పొరుగు వూళ్లలో స్థానం లభింపజేసుకోవడం మెరుగని హితోక్తి. ఈ ఆలోచనలన్నీ కొత్త పెళ్లికొడుకులను తయారు చేస్తున్నాయి. మనసులో ఏ దూరాలోచన వుందో కాని ఒక పడమటి పల్లెల శాసన సభ్యుడు మాదాసు గంగాధరం గారి మనసులో పురుగు వదలి పెట్టాడట. గంగాధరం ప్రస్తుత కేరాఫ్ చిరునామా మాగుంట సంస్థానమన్న సంగతి తెలిసిందే కదా! గంగాధరం నష్టజాతకుడు. ఎప్పుడే పదవి ఆశించినా ఆఖరి క్షణంలో ఆశాభంగం ఎదురౌతుంటుంది. నల్లపరెడ్డి శీనయ్యను మొదట అనుసరించారు; వేస్టాఫ్ ఎనర్జీ! చంద్రబాబుకు దాసాను దాస్యం చేశారు; ఎమ్మెల్సీ గిరి దక్కింది కాని, దాన్ని అనుభవించబోయే సరికి ఎన్టీఆర్ నిలువునా నరికేశాడు- కౌన్సిల్‌ను రద్దుచేసి! ఆపైన చంద్రబాబు సతీమణి ఫిర్యాదుపై పార్టీనుంచే తరిమేశారు. శీనయ్య సేనకు సర్వసైన్యాధిపత్యం చేస్తే వున్న కత్తి, డాలు కూడా పోయాయి. చెన్నారెడ్డి గారికి అంతరంగిక సేవకుడిగా వ్యవహరించి వ్రతం చెడుచుకున్నా ఫలితం దక్కలేదు. ఒక్క మాగుంట సుబ్బరామరెడ్డి చెలిమిలోనే గంగాధరం సుఖంగా వున్నది. ఇక్కడైనా పదవి ఫలం చేజిక్కించుకుందామంటే, రాజ్యసభ సీటు ఎండమావి అని తేలిపోయింది. ఢిల్లీలో పివి రాజేశ్వరరావుకు అతి ముఖ్యుడుగా ఒక మెట్టు పై కెక్కినా మూలవిరాట్ కరుణ ప్రసరించలేదు; మంత్రాలు పారలేదు.

ఇన్ని ప్రయత్నాలు, ఆశాభంగాల తర్వాత నెల్లూరు సీటుపై మోజు పెంచుకున్నట్లున్నారాయన. టికెట్ వస్తుందనే గట్టినమ్మకం వుందేమో- టౌన్ రాజకీయాలలో ప్రత్యక్ష ప్రమేయం ప్రారంభమై పోయింది. క్యాడర్ బిల్డప్‌కు జెండావీధి హత్య ఒక అవకాశంగా దొరికింది. డిజిపి భాస్కరరావు గారు నెల్లూరులో ఒక్క నిముషం ఆగినా గంగాధరంతో తన సాన్నిహిత్యమేమిటో తెలియవలసిన వారికి తెలియజెప్పి వెళ్లారు. దానికి కొనసాగింపుగా మరొక జిల్లా పోలీసు ఉన్నతాధికారి పలువురు సబిన్స్‌పెక్టర్లను పిల్చి గంగాధరం మనవాడని హెచ్చరించారట. 40 వేల బలిజ ఓట్లున్న నెల్లూరులో కాంగ్రెస్ టికెట్ సాధించుకొస్తే వరమాల మెడలో పడడం కష్టమా అన్నది ధైర్యం. నెల్లూరును బిసికే కేటాయించాలన్న డిమాండు పెడితే తనకంటే పాపులర్ బిసి ఎవరూ లేరు కాబట్టి టికెట్ రావడమొక కష్టంకాదనన్నది నమ్మకం.

గంగాధరం కాక మరొక అరడజను మంది ఆ ఆశలో వున్నారు. డబ్బు వుండడమే ఎన్నికలకు అర్హత అన్న దురభిప్రాయం చాలా మందిలో వుంది. మేమైతే ఖర్చు పెట్టుకోగలం అన్న డైలాగులు తరచూ విన్పిస్తున్నాయి. అభ్యర్థులకు దురద పుట్టి డబ్బుతో గిదుకోవలిసిందే తప్ప, కేవలం డబ్బుకు, మితిమీరిన ఖర్చుకు ఓటర్లు బుట్టలో పడతారా? అసంభవం! ఎవరైనా గమనించారో, లేదో కాని, ప్రజలలో ధనిక స్వాముల రాజకీయం పట్లముఖం మెత్తేసివుంది. ధన దర్పం ప్రదర్శన ఈసారి ఎన్నికల్లో ఏహ్యభావానికి, వైముఖ్యానికి దారి తీసి 1978 లో వలె ఆశ్చర్యకరమైన ఫలితాలు వెల్లడౌతాయేమో నన్పిస్తూంది. పార్టీ టికెట్లు వేలంలో విక్రయించే నాయకులు రెండు పార్టీల్లో

## ఆత్మకూరు డి.ము. కోర్టులో

S.C. 42/93

Between:

సిండికేటు బ్యాంకు
సీతారామపురం -వాది

and

1. సంపతి రమణయ్య
2. పగడాల వెంకటేశ్వర రావు -ప్రతివాదులు

Notice To

సంపతి రమణయ్య, S/o. వెంకట సుబ్బయ్య, పోలీసు కానిస్టేబిలు. P.C. No. చినక్రాక పోలీసు స్టేషను, జలదంకి మండలం -అనువారికి

మీ మీద సీతారామ పురం సిండికేటు బ్యాంకు వారు తమకు రావలసిన బాకీ నిమిత్తం పై కోర్టులో 29.4.94 దావా వేసి వున్నారు. కావున మీరు కాని మీ తరపు న్యాయవాది కాని 28.4.94 వ తేది పై కోర్టులో హాజరై ఆక్షేపణలు తెలుపుకొన వలసినది. లేని ఎడల దావా మీ పరోక్షమున తీర్మానించబడును.

వాయిదా తేది 28.4.94

**యక్కల రవీంద్రనాథ బాబు**
వాది తరపు న్యాయవాది

వుంచవచ్చు గాని. ఓటును అమ్ముకునే అవిజ్ఞత ఓటర్లలో లేదు. నాయకుల... కొత్త బిచ్చగాళ్లు ఈ వాస్తవం గ్రహించగలిగితే బాగుపడతారు.

## అష్టావధానం
(4 పేజీ కొరవ)

అని పూరించారు.

సంస్కృత సమాస భూయిష్టమైన ఇంతటి కఠిన పద్యం ఆ బాలుడినోట, బావిపూటలో నుంచి నీరుబికినంత సునాయాసంగా వచ్చేసింది.

గూడూరు కాలేజి ప్రిన్సిపల్ డాక్టర్ మెహర్‌మణిగారు సారా ఉద్యమంపై పద్యం చెప్పమంటే-

" సారాపోయెనే ఓ భళా
సతమిలన్ సంసార దుఃఖమ్ములే
చేరన్ బాధల కృంగు
నిజనులు వాసింగాంచు నీ స్త్రీ మహా
ధీరల్ నెల్లురి యందు
సుద్యమము సుద్దీపింపగా బూనిరే
పోరాటంబు జయంబు
గాంచెన్ అవనిన్ పూజింపగా
చెల్లులే " అని పాతం అప్పచెప్పినట్లు చెప్పేశారు.

గోపాలరెడ్డిగారు అవధానం చివర ఆ పిల్లవాడిని హార్దికంగా అభినందించారు. అవధాన కవితా కేళిలో ఉద్ధండులైన చెళ్లపిళ్ల కవి సింహాన్ని ఆనాడు చూచాను; ఇప్పుడీ కవి కిశోరాన్ని చూస్తున్నాను అన్నారాయన. డాక్టర్ మరుపూరు కోదండ రామరెడ్డి గారు మల్లికార్జునరావు ప్రతిభను వివరించారు. సంస్కృత, ఆంధ్ర సాహిత్యాలతో పాటు వ్యాకరణ శాస్త్రాన్ని కూడా పుక్కిట పట్టిన ఈ బాలుడు, స్కూలు చదువుల్లోనూ ఫస్ట్ అట.

రొటేరియన్ జెవిరెడ్డి, డాక్టర్ పెళ్లకూరు రవీంద్ర రెడ్డి, ఆర్. పెంచలసింగ్, చల్లగుండ్లరామ చంద్రయ్య గార్లను ఈ సందర్భంగా వర్ధమాన సమాజం శాలువాలతో సత్కరించింది. సమాజం కార్యదర్శి శ్రీ బివి నరసింహులు స్వాగత వందనాలు చెప్పారు.

## జిల్లావార్తలు
(5 పేజీ కొరవ)

నష్టపరిహారంలో కోటి రూపాయలకు పైగా మేనేజర్ ఫిక్సెడ్ డిపాజిట్ చేయించడంలో కృతకృత్యులై అవార్డు పొందారు.

### గని యజమానుల సంఘ సమావేశం

నెల్లూరు జిల్లా గని యజమానుల సంఘ సమావేశం ఇటీవల గూడూరులో జరిగింది. తమ సంఘ సహచరుడు శ్రీ ... కృష్ణయ్య మృతికి సమావేశం సంతాపం తెల్పింది. అనంతరం గని యజమానుల సంఘ నిర్వాహక కమిటీ ఎన్నికలు జరిగాయి. అధ్యక్షులుగా మాగుంట కోదండరామిరెడ్డి, ఉపాధ్యక్షుడుగా జిడిరావు, కార్యదర్శిగా

జి. రమేష్‌బాబు, కోశాధికారిగా డి. భాస్కరావును ఎన్నుకున్నారు. కార్యవర్గ సభ్యుల జాబితాలో వెంకటగిరి రాజా, ఎంఆర్ రావు, ఎస్‌వి భాస్కరరావు, బి. పాపయ్య , ఎ రంగారెడ్డి వున్నారు.

## నెల్లూరు ముచ్చట్లు
(6 పేజీ కొరవ)

### బుచ్చి డిగ్రీ కళాశాలకు శంఖుస్థాపన

బుచ్చిరెడ్డి పాళెం గుత్తికొండ శ్రీరాములు ఆర్ట్సు అండ్ సైన్సు డిగ్రీ కళాశాల భవన నిర్మాణానికి 25 తేది మాజీ ముఖ్యమంత్రి శ్రీ నేదురుమల్లి జనార్ధనరెడ్డి శంకుస్థాపన చేస్తారు. డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి అధ్యక్షించే కార్యక్రమంలో పులువురు మంత్రులు, ఎమ్పీలు, ఎం.ఎల్.ఏలు పాల్గొంటారు. అమెరికాలో స్థిరపడ్డ గుత్తి కొండ శ్రీరాములు 40 లక్షలకు పైగా వెచ్చించి ఈ మంచచి కార్యక్రమానికి పూనుకున్నారు.

### కడప ప్రమాదంలో నెల్లూరీయుడి మృతి

కడప, ఇండియా సిమెంట్స్ కర్మాగారంలో 21 తేది సాయంత్రం జరిగిన ఘోర ప్రమాదంలో నెల్లూరీయుడు శ్రీ రహమాన్ మరణించారు. ఆయన ఫ్యాక్టరీలో మైన్సు మేనేజర్‌గా పని చేస్తున్నారు.

రహమన్ జమీన్‌రైతుకు చిరకాలం నుంచి పాఠకుడు; అభిమాని వారి కుటుంబానికి మా సానుభూతి.

## పంచాంగం

28 తేది గురువారం ఉదయం 9.48 గంటలకు మిధున లగ్నమున గృహారంభ, ఉపనయన వివాహ, వ్యాపార ప్రారంభములకు సుముహూర్తములు కలవు.

### ఏప్రెల్ తిథులు

చైత్రశుద్ధ

తే 23 శని ద్వాదశి ఉ.గ. 8.50 వ
తే 24ఆది త్రయోదశి ఉ.గ. 6.45 వ
తరువాత పూర్తిగా చతుర్దశి
తే 25సోమ పూర్ణిమ రా.గ. 2.15 వ

చైత్ర బహుళ

తే 26 మంగళపాడ్యమి రా.గ. 11.30 వ
తే 27 బుధ విదియ రా.గ. 9.10 వ
తే 28 గురు తదియ రా.గ. 6.55 వ
తే 29 శుక్ర చతుర్థి సా.గ. 4.55 వ

**స్వయంపాకుల శ్రీనివాసులు,**
ఎం.ఏ



## దావా నోటీసు

### గూడూరు సబ్ కోర్టులో

O.S. 75/92

Syndicate Bank, Naidupet rep by its Manager -వాది

Vs

మన్నూరు గోపాల్ -ప్రతివాది

To

మన్నూరు గోపాల్ అనువారికి

పై నంబరులోని వాది నీ పై దావా తెచ్చి యున్నందున, మీరు ఆక్షేపణలు యున్న యెడల 27.4.94 తేది కోర్టులో ఉ. 10 గంటలకు హాజరై తెలుపు కోవలసినది. లేని యెడల మీ పరోక్షమున తీర్మానించబడును.

**ఎమ్. దశరథరాం**
**ఎమ్. సోమశేఖర్**
వాది అడ్వకేట్సు

## ఆత్మకూరు డి.ము. కోర్టులో

S.C. 2/93

Between:

సిండికేటు బ్యాంకు, అనంతసాగరం -వాది

and

మెంతం ఓబయ్య -ప్రతివాది

Notice To

మెంతం ఓబయ్య, S/o. రామయ్య
వెంగంపల్లి, అనంతసాగరం
మండలం, నెల్లూరు జిల్లా -అనువారికి

మీ మీద అనంతసాగరం సిండికేటు బ్యాంకు వారు తమకు రావలసిన బాకీ నిమిత్తం మీ మీద పై కోర్టులో దావా వేసి వున్నారు. సదరు దావా వాయిదా 15.6.94 వ తేదికి వేసి వున్నది. కావున మీరు కాని మీ తరపు న్యాయవాది కాని 15.6.94 తేది ఉదయం 10 గంటలకు హాజరై ఆక్షేపణలు తెలుపు కోవలసినది లేని యెడల దావా మీ పరోక్షమున తీర్మానించ బడును.

**యక్కల రవీంద్రనాథ బాబు**
వాది తరపు న్యాయవాది

## ప్రకటన

ఇందుమూలమున యావన్మందికి తెలియ చేయడమేమనగా నా క్లయింట్ నెల్లూరు జిల్లా గూడూరు మండలం వింజూరు గ్రామ కాపురస్తురాలు, చిట్టెటి రమణయ్య వురఫ్ జకరయ్య S/o. వీరాస్వామి గారి భార్య చిట్టెటి సావిత్రమ్మకు వంశపారంపర్య హక్కు అనుభవంగల ఈ క్రింది షెడ్యూలు ఆస్తిని ఆమె భర్త రమణయ్యగారు అన్యాక్రాంతం చేయబోతున్నాడని తెలిసింది. సావిత్రమ్మకు హక్కు అనుభవం గల సదరు ఆస్తిని ఎవ్వరూ అన్యాక్రాంతం చేయించుకొన్ననూ చెల్లదు. అట్లు ధిక్కరించి ఎవరైనా చేసినా నా క్లయింటునుగాని, షెడ్యూలు ఆస్తిని గాని బద్ధకించవు. అందుమీదట మేము తీసుకొనబోవు సివిల్ క్రిమినల్ చర్యలకు బాధ్యులగుదురు

షెడ్యూలు : గూడూరు మండలం, వింజూరు గ్రామములోని (1) తాటిచెట్లు -10 (2) ఉలవచేను 25 సెంట్లు (3). మిట్టతూము క్రింద మిట్టచేను- 50 సెంట్లు

-పి. ప్రభాకర శాస్త్రి
అడ్వకేటు, గూడూరు.

## నెల్లూరు సంగతులు

(4 పేజీ కొరవ)

జరిగిన ఈ శిబిరంలో హైదరాబాదుకు చెందిన డాక్టర్ భాగ్యం నక్షత్ర మూర్తి వారికి ఒకేషనల్ రిహాబిలిటేషన్ సెంటర్ కూడా నిర్వహించారు. తొలి రోజు ప్రారంభ కార్యక్రమంలో జడ్పీ ఛైర్మన్ పెళ్లకూరు రామచంద్రా రెడ్డి, ఎమ్మెల్యే జెక రెడ్డి, రొటేరియన్ జె.వి. రెడ్డి, ఐ.ఎం.ఏ. అధ్యక్షులు డాక్టర్ కృష్ణా రెడ్డి పాల్గొన్నారు. రోటరీ చేపడుతున్న వికలాంగుల సంక్షేమ కార్యక్రమాలకు జడ్పీ సంస్థ తరఫున 50 వేల రూపాయల విరాళాన్ని రామచంద్రా రెడ్డి ప్రకటించారు. శిబిరంలో పాల్గొన్న 389 మంది రోగుల్లో 269 మందిని అంగ వైకల్యం గలవారిగా గుర్తించారు. వీరిలో 63 మందికి శస్త్ర చికిత్స అవసరమని నిర్ధారించి 22 మందికి పరికరాలు, 40 మంది బధిరులకు మిషన్లు అందజేశారు. జైపూర్ పాదాలు మళ్లీ అందజేస్తామని వాగ్దానం చేసారు. శిబిరం ముగింపు రోజు జిల్లా కలెక్టర్ ఎం. సాంబశివ రావు, జాయింట్ కలెక్టర్ సతీష్ చంద్ర, ఢిల్లీకి చెందిన మంగళం స్వచ్ఛంధ సంస్థాధినేత మంగళం మాట్లాడారు. నాలుగు లక్షల రూపాయలకు పైగా ఖర్చు పెట్టిన ఈ శిబిరంలో హరిబాబుకు రొటేరియన్లు ధర్మారెడ్డి, కొండా శేఖర రెడ్డి, బలరామి రెడ్డి, భరత్ కుమార్ రెడ్డి, శరత్ సీ ఫుడ్స్ డైరెక్టర్ శ్రీ బెజవాడ వెంకట్రాం రెడ్డి సహకారం అందించారు. వైద్య సహకారాన్ని అందించడంలో డాక్టర్లు వి.వి.ఆర్. మూర్తి, చెన్నయ్య, జయచంద్ర తోడ్పాటు నిచ్చినట్లు హరిబాబు తెలిపారు.

### ఉగాదీ అర్జీ

రసిక్

కవులకు కవితలు వ్రాయడం అలవాటు
ఎంత అలవాటంటే
చేపలకు నీటిలో ఈదులాడడమంత
పక్షులకు గాలిలో తేలియాడడమంత;
ఈ అలవాటు ఉగాది రానున్న రోజుల్లో
ఎంతగా విజృంభిస్తుందంటే
దీపావళికి ముందు పిల్లలు టపాకాయల కోసం
అవి ఇంటికి వచ్చేవరకు కలవరించేటంత;
సంక్రాంతికి ముందు అంగనలురంగవల్లులతో
ముంగిళ్లు తీర్చి దిద్దడానికి సంబర పడేటంత
* * *
ఈ మారూ ఉగాది రానే వచ్చింది
నవాబ్దిలోనికి సూర్యుడు అడుగిడుతూ
కవులకు చేతి నిండుగా పని కల్పిస్తున్నారు
ఆశాగీతాలను ఆలపించమని ఆజ్ఞాపిస్తున్నారు
పరోక్ష దైవం మాట ఏమో గాని
ప్రత్యక్ష దైవం మాట ఎలా తప్పించు కోవడం?!
* * *
ఎన్నో ఉగాదులకు నా కవితలతో
ఎంతగా స్వాగత సుమాంజలి ఘటించానని?
ఎన్నెన్ని కోర్కెలు విన్నవించుకున్నానని?
ఒక ఉగాది వచ్చినప్పుడు
పింగళా! జయమంగళవు కమ్మన్నాను
ఇంకో ఉగాది వచ్చిన తరి
సౌమ్యా! నీ పేరు నిలబెట్టుకో మన్నాను
మరో ఉగాది వచ్చిన వేళ
రాక్షసా! నీవు మా పాలిటికి ప్రహ్లాదుడవు కమ్మనాను
వేరొక ఉగాది రాగానే
అక్షయా! లోకంలో ధర్మానికి అక్షయం కల్గించ మన్నా[illegible]
ఇంతెందుకు నిన్నటితో ముగిసిన శ్రీ ముఖానికి
అది వస్తున్న వేళ ఓ శ్రీ ముఖం వ్రాసి
ఉద్ధరించక పోతేమానేవు
ఉపద్రవాలు తెచ్చి పెట్టకేం
అని వేడుకొన్నాను
అది మాత్రం భూకంపాలు పుట్టించి
అంతర్ధానమైంది నింపాదిగా
* * *
అయినా మనిషికి, అందునా కవికి
ఆశ మాత్రం చావదు కనుక
హృదయమెంతగా భయకంపితమై వున్నా
ఉగాదీ అలవాటును మానుకోలేక
''ఓ సంవత్సరం పాటు ఏలుబడిని సాగించే
ఓ భావ నామ ధేయుడా, పుణ్యాత్మకా
నవ్యమైన, సవ్యమైన, భావ్యమైన, దివ్యమైన
భావాలతో పుడమిని పునీతం చేసి వెళ్ల
అని అర్జీని దాఖలు చేసుకొంటున్నాను
ఆ అర్జీ కరకు బుట్ట దాఖలవుతుందో, కాదో
లోగుట్టు పెరుమాళ్లకెరుక!
అన్న సంశయాలను దూరానికి నెట్టి
ఆశల పందిళ్లలోకి నూతనాబ్దిని
ఆహ్వానిస్తున్నాను మన అందరి తరపునా
(భావ ఉగాది నాడు Fine Arts Academy వారు ఏర్పాటు చేసిన కవి సమ్మేళనంలో వినిపించిన కవిత - రసిక్)

### అర్రా కృష్ణమూర్తికి ఉగాది పురస్కారాలు

నెల్లూరీయుడు, గాయకుడు అర్రా కృష్ణమూర్తికి హైదరాబాద్‌లోని కిన్నెర ఆర్ట్స్ థియేటర్స్ వారు ఉగాది పురస్కారాన్ని బహూకరించారు. 11 తేదీ హైదరాబాద్ భారతీయ విద్యా భవన్‌లో జరిగిన ఒక ప్రత్యేక కార్యక్రమంలో శాసన సభ స్పీకర్ శ్రీపాద రావు శాలువ కప్పి సత్కరించగా, ఆర్థిక మంత్రి కె. రోశయ్య జ్ఞాపికను అందజేశారు. ఆ పురస్కార సభకు సభా సామ్రాట్ కె.వి. భాస్కర రావు, అధ్యక్షత వహించగా జె. బాపు రెడ్డి, జ్ఞానపీఠ అవార్డ్ గ్రహీత సి. నారాయణ రెడ్డి పాల్గొని ప్రసంగించారు. పురస్కార కార్యక్రమానికి ముందు కృష్ణమూర్తిచే తెలుగు వెలుగు సంగీత విభావరి కార్యక్రమం జరిగింది. తేట తెనుగులో ఆలపించిన గీతాలు రసజ్ఞులను జల తరంగణిలో ఓలలాడించింది. భాగ్య నగరానికి ప్రాకిన కృష్ణమూర్తి ప్రతిభ దేశ రాజధానికి చేరాలని ఆకాంక్షిద్దాం.

### రిటైర్డ్ వుద్యోగుల అభ్యర్థన!

1000 మందికి పైగా సభ్యులు గల నెల్లూరు రిటైర్డ్ వుద్యోగుల సంఘం ప్రతి పక్షం రోజుల కొక సారి సమావేశ మవుతూ, వివిధ సమస్యల పై మున్నెన్నడూ లేని విధంగా చురుగ్గా పనిచేస్తూ వుంది. 20 తేది రిటైర్డ్ డిప్యూటీ కలెక్టర్ పి. వెంకట సుబ్బయ్య ఇంట్లో సంఘ సభ్యులు సమావేశ మయ్యారు. రిటైర్డ్ వుద్యోగుల సంఘం స్వంత భవన నిర్మాణానికి స్థలం మంజూరు చేయాలని కోరుతూ సంఘ అధ్యక్షుడు కె. విశ్వజ్ఞానాచారి ప్రతిపాదించిన తీర్మానాన్ని సభ్యులందరూ బలపరిచారు. కార్యదర్శి దొరై స్వామి వివరణ వందనాలు చెప్పారు. రిటైర్డ్ వుద్యోగులు తమ చేతుల మీదుగా వేలాది ఎకరాల భూమిని పంపిణీ చేసుంటారు. పాపం స్వంత సంఘ భవనాన్ని నిర్మించు కోవాలంటే ఎన్ని కష్టాలొచ్చి పడ్డాయో చూడండి. కలెక్టర్ గారూ ఈరిటైర్డ్ ఉద్యోగుల్లో సగానికి పైగా ఒకప్పుడు మీ ఆఫీసులో పని చేసిన వారే - కనికరించండి సార్!

## శివారెడ్డి పద్యాలు

### భగవాన్ రమణమహర్షి వర్ధంతి

ఏ జన్మాంతర సుకృతమొ
యీ జన్మములోన ఇప్పుడిటొక కవినై,
పూజించితి యుష్మత్పద
రాజీవయుగమ్ము చాలురా శ్రీ రమణ!

మానవుడే దైవంబను
దానికిపురుజావు ప్రబల తార్కాణముని
ధ్యానము జ్ఞానమువైకుం
ఠానికిరహదారి స్వామి రమణ మహర్షి!

ఇదికుభోదయమ్ము, ఇది సుప్రభాతమ్ము
చూడగలిగ నీ మహోత్సవాన్ని
ఇంతకంటె భాగ్యమేముంది యేదుంది
సర్వపాపదమన! స్వామి రమణ!

అయిపోయిందొకటైముపసాన కాలమ్ము
దగ్గరైంది త్వరలో దాటు నింట
ఇక్కడుండి చేసేదేముంది? పై దాక
వచ్చి నిన్ను కళ్ల జూస్త రమణ!

### ప్రధాని రోజ్‌గార్ యోజనకు దరఖాస్తులు

ప్రధాని రోజ్‌గార్ యోజన పథకానికి దరఖాస్తులకు ఏప్రెల్ 30 తేదీ వరకు తుది గడువు వుంది. పదవ తరగతి పాసైన వారు, మెట్రిక్ తప్పిన వారు, ప్రభుత్వ స్పాన్సర్స్ చేసిన ఆరు నెలల సాంకేతిక కోర్సులు పూర్తి చేసిన నిరుద్యోగులు దీనికిఅర్హులని పరిశ్రమల కేంద్రం జనరల్ మేనేజరు జి. రాజశేఖరయ్య తెలుపుతున్నారు.

### చిత్రసమీక్ష

9 పేజీ కొరవ

ఆధారంగా నందూకు శిక్ష తప్పించడంలో భాగంగా అంజలి అసలు హంతకుడు రాజాను అంతమొందించి భర్తను నిర్దోషిగా బయటకు తీసుకు వస్తుంది భారతి.

చిత్ర ప్రథమార్థమంతా మినా అతి యాక్షన్‌తో విసుగనిపిస్తుంది. కాలేజీ రోజుల్లో ఆడపిల్లలు స్వేచ్ఛగా వుండవచ్చు; బరి తెగిస్తే వివాహ మయ్యాక పాట్లు పడక తప్పదన్న అంతర్లీన భావన చిత్రంలో ఇమిడివుంది. చివరి సన్నివేశంలోని పెద్ద యాగం నిర్వహించిన హీరోయిన్ తన ఆరాధ్య దేవత అనుగ్రహం లభింపక తన మానం కాపాడు కోవడం కోసం తాళి తెంపి ప్రత్యర్థిని అంతమొందించే సన్నివేశం పేలవంగా వుంది. ఆడది అబలకాదు సబల అన్న విషయాన్ని మరో కోణంలో చిత్రీకరించి వుంటే బాగుండేది. తమిళ కథకుడు పి.వాసు కథకు గణేష్‌పాత్రో వ్రాసిన మాటలు పేలవంగా వున్నాయి. ఆడవాళ్లను హీరో వ్యాపారస్తులుగా పేర్కొన్నప్పుడు సైడ్ హీరోయిన్ ఇచ్చిన వివరణ సన్నివేశంలో మాటలు మాత్రం బాగుంటాయి. వేటూరి పాటల్లో 'అదిగో ఏమన్నది' హుషారుగా వుండింది. మిగతా పాటల్లోని సాహిత్యం దేవా సంగీత హోరులో 'కైమా' అయ్యింది. నూతన సాంకేతిక నిపుణులు లలితామణి నృత్యంలో, ఫైట్స్‌లో జాగువార్ తంగం ప్రతిభ కనపర్చలేక పోయారు. నటీనటుల్లో జగపతిబాబు, మీనా పాత్ర పోషణల్లో మెప్పించలేక పోయారు. కిన్నెర, రాజా రవీందర్ ఫర్వాలేదనిపించారు. అంతర్జాతీయ స్థాయి నటి రోహిణి హట్టంగడిని ఉత్సవ విగ్రహం చేశారు. కామెడీ ట్రాక్ కోసం వాడుకున్న కోట శ్రీనివాసరావు, బ్రహ్మానందం, ధర్మవరపు సుబ్రహ్మణ్యం ప్రతిభావంతంగా నటించారు. కుటుంబ సమేతంగా చూడతగ్గ చిత్రాలు తీసే విఎంసి పేర ఒక సరిక్రొత్త పేలవ చిత్ర జాబితా పెట్టి దానిలో 'భలే పెళ్లాం' ను చేర్చేయవచ్చు.

### సినిమా

(9 పేజీ కొరవ)

చాలామంది భావిస్తున్నారు. తెలుగు చిత్రంలో దాసరి నారాయణరావు ధరించిన పాత్రను తమిళ చిత్రంలో కమలహాసన్ నిర్వహించారు. ''మహిళలకు మాత్రమే'' లో కామెడీ పుష్కలంగా వుంది. ఈ చిత్రం విడుదలైన థియేటర్ల వద్ద మహిళలకు పసుపు, కుంకుమ పొట్లాలు ఇస్తారట!

### వెంగళరావు

(2 పేజీ కొరవ)

కల్పించారు. అటు శివశంకర్‌ను, ఇటు వెంగళరావును ఎడా పెడా వాయించి ఇప్పుడు గొంతు మీదకు తెచ్చుకొన్నారు.

వెంగళరావు చేసింది మంచిపనా ? ఆయన విమర్శల వల్ల కాంగ్రెస్‌కు నష్టం జరగదా ? అన్న ప్రశ్నలు అటుంచితే '' ఎంత కడుపు కాలకపోతే ఇంతగా విమర్శలు చేస్తాడు'' అన్న సానుభూతి వెంగళరావుకు దక్కింది. ముఖ్యమంత్రిగా, ముక్కుసూటి మనిషిగా జన బాహుళ్యంలో మంచి పేరున్న వెంగళరావు విమర్శల ప్రభావం జనం మీద, పార్టీ మీద గాఢంగా వుంటుంది. ప్రధానమంత్రి కూడా వెంగళరావు విమర్శల్ని కాస్తంత తీవ్రంగానే తీసుకొన్నారట. అయితే పార్టీపరంగా ఆయనపై 'చర్య' తీసుకునేదేమీ వుండకపోవచ్చు. గాయపడ్డ వెంగళరావును పి.వి. పిలిపించి ఓదార్చే అవకాశం లేకపోలేదు.

# మీనా జుట్టు కత్తిరించారట, పాపం!

" చాలాకాలం క్రిందట బేబీ స్టార్‌గా నా తొలి తమిళ చిత్రం 'వెంజంగల్' లో నన్ను అబ్బాయి పాత్రకు బుక్ చేసినప్పుడు నా జుత్తు కత్తిరించి, క్రాఫ్‌గా ఉంచుతామన్నారు. నేను ఒప్పుకోలేదు. దాంతో ఆ అబ్బాయి పాత్రను అమ్మాయిగా మార్చారు. అంత జాగ్రత్తగా కాపాడుకుంటూ వచ్చిన నా కేశాలను " అల్లరి పెళ్లాం" లో కత్తిరించాల్సి వచ్చింది. ఈ మారు తప్పించుకోలేక పోయాను." అని మీనా చెప్పింది. "కిలుక్కం" అనే మలయాళ చిత్రం ఆధారంగా " అల్లరిపెళ్లాం" చిత్రం తయారైంది.

## ఆటోలో మాజీ తార

ఇటీవల మాజీ తార వైజయంతిమాల, ఎంపి., ఒక ఆటో రిక్షాలో రావడం చూసి మద్రాసు లజ్‌కార్నర్ వద్ద చాలామంది నిశ్చేష్టులై పోయారు. ఆ దారంట వస్తున్న ఆమె నెరిగిన ఒక ప్రముఖ నిర్మాత "ఏమిటండీ ఆటోలో?" అని అడక్కుండా ఉండలేక పోయారు. "రాయపేట వద్ద మా కారు మొండికేసింది. దాన్నక్కడ వదిలేసి ఆటోలో ఇంటికొస్తున్నా." అందామె. " మా ఇంటి దగ్గర డ్రాప్ చేస్తాను రండి." అని ఆ నిర్మాత అంటే "థాంక్స్!" అంటూ ఆమె ఆటోలో తుర్రుమన్నదట.

## బిచ్చమెత్తిన నటుడు

కొన్ని తెలుగు చిత్రాలలో నటించిన తమిళ విలన్ లివింగ్‌స్టన్ ఏప్రిల్ 13 ఉదయం 10 గంటల నుంచి సాయంత్రం 4 గంటల వరకు పాండీ బజార్ వద్ద నేలమీద తుండుగుడ్డ పరచి, ముష్టి ఎత్తాడు. వచ్చిన డబ్బును త్యాగరాయ నగర్‌లో ఉన్న వెంకటేశ్వర ఆలయంలో సమర్పించాడు. తాను క్రైస్తవుడైనా, రజనీకాంత్ సరసన ఏదైనా చిత్రంలో బుక్ అయితే, ఈ విధంగా డబ్బు సమర్పిస్తానని మొక్కుకున్నాడట. ఇటీవల "వీరా" అనే రజనీకాంత్ నటించే తమిళ చిత్రంలో బుక్ అయిన వెంటనే తన మొక్కుబడిని ఈ విధంగా తీర్చుకున్నాడు.



అవోపా వార్షికోత్సవ సభలో వైశ్యా బ్యాంకు ఛైర్మన్ సదాశివ గుప్త దంపతులు, అంబికా అగర్ బత్తీల కృష్ణ

# అవార్డుల ఎంపికలో అన్యాయం

1992లో 104 చిత్రాలు విడుదలైతే, అవార్డులకు 40 ఎంట్రీలు వచ్చాయి. 1993లో 54 చిత్రాలకు 32 ఎంట్రీలొచ్చాయి. నంది అవార్డుల ఛైర్మన్ జస్టిస్. ఎ. గంగాధరరావు "మేము చూసిన 34 సినిమాలలో ఏడెనిమిది మాత్రమే బాగున్నాయి. చూసి చూసి మా కళ్లు కాయలు కాచాయి అంటే నమ్మండి; అసలీ కమిటీ ఛైర్మన్ భారాన్ని ఎందుకు సమ్మతించానా అని బాధపడ్డాను. కొన్నిటిలో హింస, ఫైటింగ్‌లు, సెక్స్ మితిమీరి వున్నాయి. సంభాషణలు కొన్నిటిలో అసభ్యంగా వున్నాయి." అన్నారు.

" మిస్టర్ పెళ్లాం" చిత్రానికి 6 అవార్డులు, "గాయం" చిత్రానికి 6 అవార్డులు, ఉత్తమ ద్వితీయ చిత్రం "మనీ" కి మూడు అవార్డులు, తృతీయ ఉత్తమ చిత్రంగా "మాతృదేవోభవ" కు రెండు అవార్డులు వచ్చాయి. ఈ మారు అవార్డుల ఎంపిక న్యాయంగా లేదని పలుచోట్ల వినిపిస్తున్నది. ఉత్తమ హీరోగా సుమన్ (బావ-బావమరిది), ఉత్తమ హీరోయిన్‌గా ఆమని (మిస్టర్ పెళ్లాం) ఎంపిక అవడం ఏమిటా అని చాలామంది అసంతృప్తి వెలిబుచ్చారు. మద్యపాన నిషేధాన్ని ప్రబోధించిన "మాతృదేవోభవ" చిత్రానికిని, "దండోరా" చిత్రానికి గాని ఉత్తమ చిత్రం అవార్డు వస్తుందని చాలామంభావించారు. నిర్మాత కె. ఎస్. రామారావు ఈ విషయమై వ్యాఖ్యానిస్తూ, "ఒక ఆశయానికి కట్టుబడి, సమాజం పట్ల బాధ్యత గల పౌరుడిగా, సామాజిక స్పృహ గల చిత్రాలను నిర్మించే నటుడు, దర్శక నిర్మాత ఆర్. నారాయణమూర్తి సారా వ్యతిరేకోద్యమ స్ఫూర్తితో నిర్మించిన 'దండోరా' చిత్రానికి తృతీయ శ్రేణిలోనైనా గుర్తింపు రాకపోవడం శోచనీయం. కనీసం మా 'మాతృదేవోభవ' చిత్రానికిచ్చిన తృతీయ ఉత్తమ చిత్రం అవార్డునైనా 'దండోరా' చిత్రానికి ఇచ్చి వుంటే ఎంతో సంతోషించేవాడ్ని" అన్నారు. ఇంత కాలానికైనా ఉత్తమ దర్శకుడు (అల్లరి ప్రియుడు) అవార్డుకు కె. రాఘవేంద్రరావు ఎంపికైన ఒక్క విషయంలోనే చాలామంది సంతృప్తి వెలిబుచ్చారు.

## కృష్ణుడంటే కృష్ణుడే

చిత్ర కథకు తగ్గ టైటిల్ ఉంటోందా కొన్ని చిత్రాలకు - అని పలువురి సందేహం. అసలు కథ ఉంటోందా - అని మరికొందరి సంశయం. అభిమానులను దృష్టిలో పెట్టుకుని పేర్లు పెట్టడంన్నివిధాలా మంచిదని దర్శక నిర్మాతల అభిప్రాయం. హీరో కృష్ణ ద్విపాత్రలతో విజయనిర్మల ఫైన్‌ప్లే, దర్శకత్వంలో ఎస్.కె.సినీ క్రియేషన్స్ నిర్మించే చిత్రం పేరు "కృష్ణుడంటే కృష్ణుడే"

## పోలికలు

"నైనటు ఫైవ్" అనే ఆంగ్ల చిత్రం ఆధారంగా గతంలో తెలుగులో 'లేడీస్ స్పెషల్' చిత్రం తయారైంది. అప్పుడు అదే ఆంగ్ల చిత్రం స్ఫూర్తితో కమలహాసన్ రచించి, రూపొందించిన " మగలిర్ మట్టుమ్" తెలుగులో "మహిళలకు మాత్రమే" గా డబ్ చేయబడుతోంది. అయితే, సన్నివేశాలలో కొన్ని పాత్రల కల్పనలో చాలా తేడాలున్నాయని సినీరంగంలో

కొరవ 8 పేజీలో

**చెత్త చిత్రం తీయడంలో తానూ తీసిపోనని దర్శకుడు క్రాంతికుమార్ నిరూపించుకున్నాడు**

# భలే పెళ్లాం

**చిత్రసమీక్ష**
*** అల్లూరు రహీం**

స్వాతి, సీతారామయ్య గారి మనుమరాలు వంటి సినిమాలు తీసిన క్రాంతికుమార్ పరమ చెత్త చిత్రాలు కూడా తీయగలరనే అభిప్రాయానికి 'భలే పెళ్లాం' చిత్రాన్ని చూసిన ప్రేక్షకులంతా వస్తారు. 'పురుష లక్షణం' తమిళ చిత్రం ఆధారంగా ఈ చిత్రాన్ని తీశారు. క్రాంతికుమార్ చిత్ర ఆద్యంతం తమిళ మూసలోనే సన్నివేశ చిత్రీకరణ చేశారు. చిత్రానికి బిగువైన చివరి మలిక సన్నివేశం కూడా పేలవంగా తీశారు. చిత్రం సాంఘిక చిత్రమైనా, తమిళ భక్తి సినిమాల్లోలా పొర్లింతలు, వెర్రికేకలతో ప్రేక్షకులకు శిరోభారం వచ్చేస్తుంది. ప్రథమార్థంలో హీరోయిన్ ప్రతి ఒక్కరినీ 'రే' అంటూ పిలుస్తూ చేసే యాక్షన్‌కు ఒళ్లు కంపర మెత్తుతుంది. ఒక సన్నివేశంలో క్యారెక్టర్ నటుడు మందు కొడుతూ గాంధీజీ 'నారియా హమారే భార్యేం', గురజాడ అప్పుకుట్టి ఏదో అన్నారని అంటూ జాతీయ నాయకులను చులకన చేసి మాట్లాడే డైలాగులను సెన్సార్ ఎలా అనుమతించిందో అర్థంకాదు. డబ్బింగ్ ధోరణిలో సాగే రీవా సంగీతంతో ప్రేక్షకులు సహనం కోల్పోతారు. మేటి సాంకేతిక నిపుణులను పెట్టుకుని కూడా స్త్రీ సమస్యాత్మక చిత్రాలు తప్ప కమర్షియల్ టచ్ సినిమాలకు తాను పనికి రానని క్రాంతికుమార్ 'భలే పెళ్లాం' చిత్రం ద్వారా నిరూపించుకున్నారు.

యువ పారిశ్రామికవేత్త నందగోపాల్ (జగపతిబాబు) తన తండ్రి మరణానంతరం ఆఫీసు బాధ్యతలు స్వీకరిస్తాడు. ఆఫీసు మేనేజర్ (గొల్లపూడి మారుతీరావు) కుమార్తె అంజలి (కిన్నెర) బర్త్‌డే పార్టీకి వెళతాడు నందగోపాల్. అక్కడ అతడ్ని చూసి మనసు పారవేసుకుని, ఆకర్షించాలని భారతి (మీనా) ప్రయత్నిస్తుంది. కాని కన్నెత్తైనా ఆమెవైపు చూడకుండా వెళతాడు నందగోపాల్. పట్టు వదలని వీర నారీమణిలా భారతి పత్రికల్లో, బెలూన్లపైన 'నందూ ఐ లవ్ యూ' అంటూ ప్రకటింపచేసి అతడ్ని వీధుల్లో పెడుతుంది. అది చాలక 'నిను వీడని నీడను నేనంటూ' టేప్ రికార్డర్ చేతిలో పట్టుకుని అర్థరాత్రి దేపట్టు గోడలపై తిరుగుతుంది. ఈ బాధ భరించలేని నందూ ఆమెను పెళ్లి చేసుకుంటాడు. కొత్త కాపురం శతదినోత్సవాన నందూ న్యూఢిల్లీకి అత్యవసర పనిమీద బయలుదేరుతాడు. భారతిపై కాలేజీ రోజుల్లో మనసు పెంచుకున్న సైకో రాజా (రజా రవీందర్) ఫ్రెండ్లీగా ఇంటికి వచ్చి బెడ్‌రూంలోకి దూరడం, ఆ సమయంలోనే నందు ఫ్లయిట్ రద్దయి ఇంటికి రావడం జరుగుతుంది. బెడ్‌రూంలో రాజా, భారతిని ఒక భర్త చూడలేని భంగిమలో చూసి భారతిని ఇంటినుండి వెళ్లగొడతాడు. ఆరోజు నుండి మనసు పాడు చేసుకుని తాగుడుకు బానిసైన నందూకు నచ్చచెప్పను వచ్చిన అంజలి అనూహ్య పరిస్థితిలో మిద్దెపై నుండి పడి మరణిస్తుంది. నందూపై హత్యానేరం ఆపాదించ బడుతుంది. ఫోటోగ్రాఫర్ నాయర్ (సుధాకర్ ) తీసిన ఫోటో

కొరవ 8 పేజీలో

బివి బ్రదర్స్ పరిశ్రమల సముదాయం అధిపతి బాదం వెంకట నారాయణ కుమార్తె కళ్యాణి; రాము; వీరి పెండ్లి మార్చి 27 తేదీ నెల్లూరులో జరిగింది.

## రెడ్డి రాజ్యం

(మొదటి పేజీ తరువాయి)

బర్వాటా చేసే పోస్టాఫీసుగా మారే ప్రమాదం ఏ జిల్లా అధ్యక్షుల్ని పరచే కార్యక్రమాలేవీ ఆయన చేపట్టరు. "నా పదవి నాకుంటే అదే పదివేలు" అనే ధోరణి ఆయనది. ఆయన శక్తికి అంతకంటే మించి చేసేది కూడా ఏమీ లేదు. తులసీదాస్ రెండేళ్ల కాలంలో పార్టీ కీళ్లు సడలిపోయాయి. అధికార చట్రాన్ని ఆసరా చేసుకొని కాంగ్రెస్ పార్టీ కుంటుకుంటూ నడుస్తోంది. ఎన్నికలకు ముందు కాంగ్రెస్ పార్టీకి శస్త్ర చికిత్స చేయకుంటే పూర్తిగా అవిటిగా మారే ప్రమాదం వుంది.

వీటన్నిటిని దృష్టిలో పెట్టుకొని ప్రధానమంత్రి రాష్ట్రంలో ఒక ప్యాకేజీ కార్యక్రమాన్ని ఆచరణలోకి తేవాలనుకుంటున్నారు. ఇందులో మొదటిది "రాష్ట్ర ప్రభుత్వం అందరిది" అన్న అభిప్రాయం కలిగించటం. రాష్ట్రం 'రెడ్డిరాజ్యం'గా తయారైందన్న విమర్శను పలచన చేసి ఇది కాంగ్రెస్ ప్రభుత్వం, ఇది అందరి ప్రభుత్వం అన్న అభిప్రాయం కలిగించాలన్నది ప్రధాని అభిమతంగా కనబడుతోంది. ఇప్పటికే బిసిలు, ఎస్.సి., ఎస్.టి.లు, మైనార్టీలు క్రమంగా దూరమై పోతున్నారు. మరోపక్క బహుజన సమాజ్ పార్టీ కోస్తా ప్రాంతంలో కాళ్లూనుకుంటోంది. దీనికి విరుగుడు మంత్రం వేయకపోతే కాంగ్రెస్ ఓటు బ్యాంకు పట్టిపోతుంది. అందుకే షెడ్యూల్ కులాల వారికి ఉప ముఖ్యమంత్రి పదవి కట్టబెట్టాలి. నిజానికి విజయ భాస్కరరెడ్డి ముఖ్యమంత్రిగా పదవి స్వీకారం చేసిన రోజునే ప్రధాని ఈ ప్రతిపాదన చేశారు. అధికారాన్ని మరో వ్యక్తితో పంచుకునేందుకు ముఖ్యమంత్రి ఇంతకాలం విముఖంగా వున్నారు. అయితే "మారిన" పరిస్థితుల దృష్ట్యా ఇప్పుడు ఉప ముఖ్యమంత్రి పదవి కట్టబెట్టక తప్పేట్లు లేదు. ఉప ముఖ్యమంత్రి పదవి ఇస్తే ఎవరికివ్వాలి ? ఏ ప్రాంతం వారికివ్వాలి ? అన్నవి కూడా ప్రధాని ఇష్ట ప్రకారమే జరుగవచ్చు. తెలంగాణా నుంచి ఉప ముఖ్యమంత్రి కావాలని ఆశలు పెట్టుకొన్న పాటి రాజం కాలం చేశాడు. మిగిలింది ఖమ్మం జిల్లా మంత్రి చంద్రశేఖర్, కృష్ణా జిల్లా మంత్రి కోనేరు రంగారావు. నెల్లూరు జిల్లా మంత్రి పసల పెంచలయ్య కూడా సమర్థుడే అయినప్పటికీ "జనార్థన" రథాన్ని అంటిపెట్టుకొని వుండటంతో ఆయన అభ్యర్థిత్వానికి "కోట" లో ప్రవేశం దొరక్కపోవచ్చు. మరి ముఖ్యమంత్రికి ఇష్టం లేని వ్యక్తిని పి.వి కూడా రుద్దక పోవచ్చు. రాష్ట్ర మంత్రివర్గం 'రెడ్ల'మయం అయిందన్న విమర్శను దృష్టిలో పెట్టుకొని ఒకరిద్దరు బి.సి.లకు మంత్రివర్గ పేరమాల వేసే ఆలోచన కూడా వుందట.

పార్టీ పరమైన సంస్కరణల్లో ప్రధానంగా పిసిసి అధ్యక్షుడి మార్పు. తులసీదాస్‌ను తప్పించేందుకే ఆయనకు రాజ్యసభ ఇచ్చారు. కాబట్టి 'తులసి' స్థానంలో మరో వ్యక్తిని నియమించాలి. రాష్ట్రంలో 'కాపుల'కు అన్యాయం జరిగిపోతోందని ఒకవైపు కాపులు ఘోషిస్తున్న విషయాన్ని దృష్టిలో పెట్టుకొని కాపుల్లో 'ఓ పెద్ద తలకాయకి' పిసిసి బాధ్యత అప్పజెప్పాలన్నది ప్రధాని ఆలోచన. మాజీ ఎం.పి. సింగం బసవ పున్నయ్యను ముఖ్యమంత్రి గౌరవించుకున్నారు. అయితే ముఖ్యమంత్రి వ్యతిరేకవర్గాలు అందుకు ససేమిరా అంగీకరించటం లేదు. ముఖ్యమంత్రి చెప్పిన వ్యక్తి కాకుండా ఇంకెవరైనా పరవాలేదని వారి డిమాండు. ఇప్పటికే వై.ఎస్.రాజశేఖరరెడ్డి, ద్రోణంరాజు ప్రభృతులు పివిని కలిసి ముఖ్యమంత్రి చెంచాలకు కాకుండా స్వతంత్ర నిర్ణయాలు తీసుకునే వ్యక్తికి పిసిసి అప్పజెప్పాలని గట్టిగా కోరారు. మాజీ ముఖ్యమంత్రి ఎన్. జనార్థనరెడ్డి కూడా తన మనసులో మాట పి.వి.కి ఈపాటికే చెప్పి వుంటాడు. పి.వి. కూడా ముఖ్యమంత్రిని పెంచాలని అనుకోవటం లేదు కాబట్టి పిసిసి అధ్యక్షుడి ఎంపికలో కోట్ల వ్యతిరేక వర్గాలే నెగ్గవచ్చు. కేంద్రమంత్రి మల్లికార్జున్ పట్ల పి.వి. మొగ్గు చూపుతున్నారట. కానీ పిసిసి పీఠం కోస్తా కాపులకు ఇవ్వకపోతే తీవ్ర ప్రతిఘటన ఎదుర్కోవాల్సి వస్తుందని పునరాలోచనలో పడ్డారు. కేంద్రమంత్రి రంగయ్యనాయుడ్ని తెరమీదకు తెచ్చే అవకాశం కూడా లేకపోలేదని అంటున్నారు. అటు ప్రభుత్వపరంగా, ఇటు పార్టీ పరంగా పివి ప్యాకేజీ పథకం అమలు మరో వారం రోజుల్లో ఆచరణకు రావచ్చు. ఇలా వుండగా జనార్థనరెడ్డి కమిటీ రిపోర్టు ప్రకారం ఎన్నికల పరిశీలకుల్ని ఆయా నియోజకవర్గాలకు పంపుతున్నారు. కాంగ్రెస్ పార్టీ పరంగా పరిశీలకుల రాకతో ఎన్నికల వేడి అంటుకుంటుంది. ప్రజా బాహుళ్యంలో 'మంచి పేరు' వున్న వారికే పార్టీ టిక్కెట్టు అన్న జనార్థనరెడ్డి కమిటీ సిఫార్సు పుణ్యమా అని ప్రస్తుత కాంగ్రెస్ ఎమ్మెల్యేలు వడపోతలో సగానికి సగం తగ్గినా ఆశ్చర్యం లేదంటున్నారు. ఎమ్మెల్యే అయ్యాక నియోజకవర్గం మొఖం చూడని ప్రజా నాయకులకు జనార్థన కమిటీ గండకత్తెర వేసింది. టిక్కెట్ల కోసం నాయకుల చుట్టూ తిరిగే వారంతా ఇప్పుడు ప్రజల దగ్గరకు వెళ్లే పరిస్థితి కల్పించారు. పరిశీలకుల రాకతో ఇక గ్రామాలు హోరెత్తటం ఖాయం

### మదనపల్లె సబార్డినేటు జడ్జి కోర్టులో

E.P. No. 51 of 92

S.C. No. 31 of 91

పి. రామచంద్రా రెడ్డి -DHr/వాది

బి.గంగప్ప వగైరా - JDr's/ప్రతివాది

నోటీసు

To

JDr No.1) బోడెద్దుల గంగప్ప

S/o. వెంకటప్ప, రేణిమాకుల

గొల్లపల్లి, వాయల్పాడు మండలం

చిత్తూరు జిల్లా

పై న కనిన నెంబరు ఎగిక్యూషన్ పిటీషను వారి D.Hr/వాది J.Dr's అయిన మీ పై డిక్రీ బాకీని రాబట్టు కొను నిమిత్తం E.P. దాఖలు చేసి యుంటున్నారు. సదరు E.P. దావాలోని 1వ JDr/ప్రతివాది అయిన మీకు జప్తి కాబడిన స్థిరాస్తి యొక్క Sale Notice కు గాను వాయిదా 28.4.94 తేదిన వుంటున్నది. సదరు వాయిదా రోజున పై కోర్టు నందు వుదయం 10 గం. 30 నిముషములకు హాజరయి మీకు ఆక్షేపణలున్న యెడల తెలుపు కొన వచ్చును. కానంతట ఎక్సపార్టీగా తీర్మానించబడును.

వాయిదా తే 28.4.94

ఎన్.ఎస్.ఎన్. ప్రసాద్

D.Hr వారి పరం న్యాయవాది, మదనపల్లి

### నువ్వుల

(మొదటి పేజీ తరువాయి)

తిరుపతికి పంపి పరీక్ష చేయించారు.

ఎందరెంత ప్రయత్నించినా వ్యక్తి త్వ విలువ, ప్రజాసేవా ధ్యేయం కలిగిన తనలోని తరలింపుకు వెళ్లింది.

సుమారు మూడు దశాబ్దాలుగా రాపూరు రాజకీయాల్లో ధీరోదాత్తంగా వ్యవహరించిన నాయకుడు శ్రీ నువ్వుల. ముప్పయ్ అరేళ్ల క్రితం, 1959 లో కంభాలపల్లి సర్పంచ్‌గా నాయుడు గారి రాజకీయ జీవితం ప్రారంభమైంది. మొదట మొదట ఆనం అనుచరుడిగానే వుండినారు. ఆ వర్గం తరపునే 1964 లో ల్యాండ్ మార్టిగేజ్ బ్యాంకు వ్యవస్థాపక అధ్యక్షుడైనాడు. తర్వాత వారితో విభేదించి 1970 లో రాపూరు సమితి ఎన్నికల్లో పోటీ చేసి ఒకే ఒక్క ఓటు తేడాతో ఓడిపోయారు. 1972 శాసన సభ ఎన్నికల్లో అనాటికి అతి బలవంతులైన ఆనం వారి అభ్యర్థి కాకాణి రమణా రెడ్డిని, క్రింద నుంచి పై వరకు అధికారం అండ గల్గిన కేంద్ర మంత్రి వివి రఘునాథ రెడ్డి అనుచరుడు, కాంగ్రెస్ అభ్యర్థి ఎల్‌వి కృష్ణారెడ్డిని చిత్తుగా ఓడించి స్వతంత్రుడిగా అసెంబ్లీలోకి ప్రవేశించారు. అప్పట్లో ఆనం వెంకట రెడ్డి, సంజీవ రెడ్డిలను కాదంటే పచ్చి మంచి నీళ్లు కూడా పుట్టవనే భీతి వుండేది. ఇంకొక ప్రక్క ఇందిరమ్మ గాలి జోరుగా వీస్తుండింది. కేవలం మంచి తనం, సేవాభావాలతో ప్రజల అభిమానం చూరగొని కొండను ఢీ కొని గెల్చిన పొట్టేలు వలె గుర్తింపు పొందారు నాయుడు గారు. 1978 లో ఇందిరా కాంగ్రెస్ అభ్యర్థిగా సునాయాసంగా గెలుపొందారు. 1983, 1985 లలో మాత్రం ఓటమి ఎదురైంది. 1989 లో మళ్లీ గెల్చారు. ఎన్నికల రాజకీయాలలో గెలుపు ఓటములు సహజంగా చవి చూసిన వెంకట రత్నం నాయుడు తన సుదీర్ఘ ప్రజా జీవితంలో ఎమ్మెల్యేను మించి పై కెదగలేక పోయారు.

మంత్రిత్వాల ఆశ వుండినా, ఎప్పుడూ ఆరాట పడలేదు. దాని కోసం అడ్డమైన గడ్డి కరవలేదు. 1991 లో చెన్నారెడ్డి దిగి పోతూ పోతూ రాష్ట్ర సివిల్ సప్లయిస్ కార్పొరేషన్ ఛైర్మన్‌గా నియామకపు ఉత్తర్వు చేతిలో పెట్టాడు కాని, అప్పుడే జనార్థన రెడ్డి సిఎం కావడంతో, దాన్ని తీసుకో కుండా వదిలేశారు.

అటు రాజకీయంగా, అటు వ్యక్తిగతంగా నాయుడు గారి నిష్కళంక, నిజాయితీ పరుడు. కులం ప్రమేయంతో ఆయన్ను తెలుగు దేశంలోకి లాగటానికి చాలా ఒత్తిడి వచ్చింది. కాని ఏడేళ్ల ఎన్టీఆర్ పాలనలో ఒక్కసారి కూడా అటు కన్నెత్తి చూడ లేదు; పిలకనైన కాంగ్రెస్ వారి గానే వుండ గల్గినారు. ఎప్పుడూ పార్టీ మారలేదు. తనకు ఏ మేలు చేయకున్నా, ఏ పదవి ఇవ్వకున్నా జనార్దన రెడ్డి పొంగత్వం వీడలేదు. రాజకీయ పరమైన అవినీతికి వెంకట రత్నం నాయుడు గారు అమిత దూరం. తెలుగు గంగ ముంపు భూములకు తగిన నష్ట పరిహారం ఇప్పించే దానికి పెద్ద ఉద్యమమే నడిపినా, రైతులకు లాభదాయకతను సాధించి పెట్టినా తన స్వార్థం చూసుకోలేదు. కుటుంబాన్ని ఆర్థికంగా బలహీన స్థితిలో వదలి వెళ్లారాయన.

నాయుడు గారి పట్ల రాపూరు ప్రజానీకంలో ఎంతటి అభిమానం గూడు కట్టుకొని వుందో ఆయన మరణం తర్వాత వ్యక్తమైంది. భౌతిక కాయాన్ని బుధవారం మధ్యాహ్నం స్వగ్రామమైన పంగ్లూరుకు చేర్చే సరికి, వేల సంఖ్యలో జనం వెల్లువలా వచ్చి అంతిమ దర్శనం చేసుకొన్నారు. ప్రభుత్వం తరపున సహకార మంత్రి శ్రీ చెంగా రెడ్డి హాజరైనారు. మరణ వార్త వింటూనే మాజీ ముఖ్యమంత్రి శ్రీ నేదురుమల్లి జనార్దన రెడ్డి ఆఘమేఘాల మీద పంగ్లూరు వచ్చి వాలారు. రాజకీయ ప్రత్యర్థులైన ఆనం రామనారాయణ రెడ్డి, వివేకానంద రెడ్డి వంటి వారి నుంచి, అనుచరులైన పాపకన్ను రాజశేఖర రెడ్డి, కొమ్మి లక్ష్మయ్య నాయుడు వరకు అసంఖ్యాకంగా నాయకులు తరలి వచ్చారు. 21 తేది ఉదయం కలెక్టర్ ఆధ్వర్యంలో ప్రభుత్వ లాంఛనాలతో అంత్యక్రియలు జరిగాయి.

నిష్కల్మషత్వం, నిజాయితీ, నిలకడత్వం కల్గిన రాజకీయ వాదిగా వెంకట రత్నం నాయుడు గారు చిరకాలం రాపూరు ప్రజల స్మృతి పథంలో నిల్చిపోతారు. వారి కుటుంబానికి మా ప్రగాఢ సానుభూతి.

జమీన్‌రైతు
సంవత్సర చందా రూ. 100/-
అర్ధ సంవత్సర చందా రూ. 50/-
విడి ప్రతి రూ. 2.00



గుప్త బ్రదర్స్ భాగస్వామి మండూరు వెంకట సుబ్బరాయ గుప్త కుమార్తె హేమమాలిని, భాస్కర రావు. వీరి వివాహం 18 తేది నెల్లూరులో జరిగింది

## జనవాణి

(3 పేజీ కొరవ)

వెంగళరావు నీతి, నిజాయితీగా వుంటే కోట్లాది రూపాయలు ఎలా సంపాదించారు? ఉద్యోగస్తులకు వినవో, పార్టీకి, ప్రజలకు జరిగిం తను అధికారంలో వుండగా చేసిందేమీ లేదు. కొడుకులకో, బంధువులకో, అనుచరులకో పదవులు రాలేదని, పనులు జరగలేదని అధికారంలో వున్న వ్యక్తిని విమర్శించడం ఆయనకు తగదు. ఈ విధమైన విమర్శల వల్ల పార్టీకి ఏమైనా లాభం కల్గిందా అంటే అదీ లేదు. మరింతగా ప్రజల్లో చులకన అయ్యింది. ముఠా తగాదాలు, నిరంతర వర్గాల ద్వేషాల వల్ల పార్టీ నాశనమవుతూంది. సామాన్య కార్యకర్తలు నాయకుల ఈ తీరు వల్ల జనంలోకి పోలేని పరిస్థితి ఏర్పడుతూంది.

నెల్లూరు - పందిళ్లపల్లి అరుణమ్మ

### టౌన్‌లోని థియేటర్లలో ఏసి వేయడం లేదు!

టౌన్‌లోని సినిమా హాళ్లలో ప్రాథమిక సౌకర్యాలు అడుగంటి పోయి వున్న విషయం జగమెరిగిన సత్యమే. మరుగు దొడ్లు అధ్వాన్నంగా వుంటాయి. మంచి సీటుకై కటకట లాడి, కూల్ డ్రింకులకై ఎగబాకాల్సి వస్తుంది. ఇక పోతే టౌన్‌లోని ఏ ఎసి థియేటర్‌లోనూ 'షో' పూర్తి అయ్యేవరకు ఏసిని వుంచటం లేదు. సినిమా మొదలయ్యే వరకు మాత్రమే వుంచి, తరువాత ఆపేస్తున్నారు. కనీసం ఆ థియేటర్లలో ఫ్యాన్లు కూడా వేయడం లేదు. ఏసి థియేటర్లకు పోయిన జనం చెమటతో తడచి ముద్దయ్యి బయటకు వస్తున్నారు. థియేటర్ల వారు విద్యుత్ సరఫరాలో లోపమనే కుంటి సాకును ప్రతిరోజూ చూపిస్తున్నారు. అలాంటప్పుడు సినిమా టిక్కెట్లలో ఏసి ఛార్జీ మినహాయించి వసూలు చేయమని యజమానులను ఆదేశించే దమ్మున్న అధికారి జిల్లాలో ఏ ఒక్కరూ లేకపోవడం దురదృష్టకరం. మునిసిపల్ కమీషనర్, కలెక్టర్ గార్లు ఈ విషయంలో చొరవ చూపాలి.

నెల్లూరు -ఎం. ప్రత్యూష

### గ్రామాల్లో విద్యుత్ కోత తీవ్రం

గ్రామాల్లో అప్రకటిత విద్యుత్ కోతను విధిస్తున్నారు. అడిగేవాళ్లు లేకపోవడంతో విద్యుత్ శాఖాధికారులకు అడ్డు అదుపు లేకుండా పోయింది. మండల కేంద్రమైన అల్లూరులో 17 తేది మొదలు ఏ రోజూ ఐదారు గంటలకు మించి కరెంట్ వుండడం లేదు. 17, 18, 20 తేదీల్లో అప్రకటిత కోతకు ప్రజలు అల్లాడి పోయారు. టౌన్‌లలో ప్రాంతాల వారీగా ముందుగా ప్రకటించి విద్యుత్ సరఫరా ఆపేస్తున్నారు. అదే గ్రామీణ ప్రాంతాల్లో అయితే ఏ సమయంలో సరఫరా వుంటుందో, ఎప్పుడు వుండదో సంబంధిత శాఖాధికారులు ప్రకటించలేదు. కోత విషయం అడుగను ఆఫీసుకు వెళ్తే అందుబాటులో ఏ అధికారి వుండరు. కరెంట్ కోత ప్రభావం మంచి నీటి సరఫరా పథకాల పై పడి రెండు మూడు బిందెలకు మించి మంచినీళ్లు కొళాయిల్లో రావడం లేదు. ఎండాకాలం నీటి కై ప్రజలు అల్లాడి పోతున్నారు. విద్యుత్ శాఖ వున్నతాధికారులు తక్షణం తగిన చర్యలు తీసుకొని కోత వేళలు ప్రకటించమని మనవి.

-పఠాన్ మహబూబ్ ఖాన్

అల్లూరు

### కావలెను

నెల్లూరు మైన్స్ గ్రూప్ ఒకేషనల్ ట్రైనింగు సెంటరులో INSTRUCTOR గా పనిచేయుటకు అభ్యర్థుల నుండి దరఖాస్తులు కోరడమైనది.

కనీస అర్హతలు: మైన్ ఫోర్‌మెన్ సర్టిఫికేటు U/R కలిగి, కనీసం 5 సంవత్సరముల (గని ఫోర్‌మెన్‌గా) అనుభవము కలిగి యుండవలెను.

రిటైరు అయిన అభ్యర్థులు కూడా దరఖాస్తులు పంపుకో వచ్చును.

దరఖాస్తులు ఈ క్రింది అడ్రసుకు అన్ని వివరములతో ఈ నెలాఖరులోగా పంపవలెను.

సెక్రటరీ
V.T. సెంటరు
(P.O.) కలిచేడు - 524 409
నెల్లూరు జిల్లా

### జనార్దన రెడ్డి కాలనీ వాసుల పాట్లు

చేట్టల కార్మికులు ఇళ్ల స్థలం కోసం ఎన్నో ఏళ్ల పోరాటాలు చేసి ఇటీవల ఇచ్చిన 93 జనవరిలో వాటిని ఇచ్చారు. కాని వాటిలో కనీస సౌకర్యాలు కల్పించడంలో ఏ మాత్రం శ్రద్ధ చూపించలేదు. పెన్నానదిలో నీరు వస్తే చాలు కాలనీలోని ఇళ్లన్నీ మునిగి పోతున్నాయి. ఒకటవ నెంబరు లేబర్ కాలనీలో ప్లాట్లు మొత్తం ఖాళీగా వున్నాయి. ప్రస్తుతం జనార్దనరెడ్డి కాలనీ లోని 110 మందికి పక్కన వున్న నెంబరు వన్ లేబరు కాలనీ లో స్థలం కేటాయిస్తే ఒడిదుడుకులు లేని జీవనాన్ని కార్మికులు గడుపుతారు.

నెల్లూరు -షేక్ గౌసిమొహియుద్దీన్

### 'గాట్'పై ప్రజాభిప్రాయ సేకరణ జరపాలి

కేంద్ర ప్రభుత్వం గాట్ నిబంధనలకు తల వొగ్గుతూ ఒప్పందంపై సంతకం చేసింది. దీని వెనుక ఐ.ఎం.ఎఫ్., ప్రపంచబ్యాంకుల హస్తమున్నట్లు తెలుస్తున్నప్పటికీ కేంద్ర ప్రభుత్వం తానెవరికీ లొంగనట్లు డాంబికాలు పలుకుతోంది. ఇప్పటికే టాటా, గోద్రెజ్ వంటి కంపెనీలు కూడా విదేశీ సంస్థల పోటీకి తట్టుకోలేక తమ షేర్లను విదేశీ సంస్థలకే అమ్మివేస్తున్నాయి. ఒకవైపు స్వదేశీ సంస్థలు నేల కూలుతున్నా, ప్రభుత్వం విదేశీ సంస్థలకు స్వాగత సత్కారాలందిస్తోంది. 80 కోట్ల మంది ప్రజలతో ముడిపడి వున్న ఈ సమస్యలపై కనీస ప్రజాభిప్రాయాన్ని తీసుకోవాలన్న ఆలోచన ప్రజాస్వామ్య ప్రభుత్వానికి రాకపోవడం దారుణం. దేశ ప్రజల ఆలోచనలకు దర్పణమైన పార్లమెంటులో గాట్‌పై విస్తృతంగా చర్చకు అనుమతించక పోవడం ప్రభుత్వ వాస్తవ ధోరణిని ప్రతిబింబిస్తుంది. నిరసన ప్రదర్శనలు, ధర్నాలు జరుగుతున్నా ప్రభుత్వానికి ఏమీ పట్టక పోవడం అన్యాయం.

గూడూరు - జి.చరణ్‌సాయి.

### 50 ఏళ్ళ క్రితం ఈ వారం

3. "ట్రంకురోడ్డులో ఒక హోటలులో మొన్న కాఫీ త్రాగుతుంటే రెండు పెరవులు బంకవేసి కరిపించి నట్లు కరుమకపోతున్నవి. ఏదో చెడ్డ పదార్థం కలుపుతున్నారు కాఫీలో- అదే హోటలులో మొన్న మిత్రునికి కాఫీ తెచ్చియిస్తే సికాయగింజల పొడిగా కనిపించింది. అతను గల్లాటేసి మందలించి పోయినారు.

-రాజు".

ఇలా ఎన్ని రిపోర్టులైనా వున్నవి. హెల్తు స్టాఫును హోటళ్ల వాళ్లు ముక్కుమయ్యా మేపుతారు. అందువల్ల కుయ్-కయ్ అనరు. హెల్తు ఆఫీసరు గారు యీ విషయమై శ్రద్ధ పుచ్చుకోకుంటే టవును ఆరోగ్యమెట్లా కుదటబడుతుంది?

### కస్తూరీదేవి విద్యాలయం

పై పేరుతో ఆడపిల్లల హైస్కూలు జరపడానికి ప్రయత్నాలు జరుగుతున్నవి. రికగ్నైషన్ ప్రభుత్వానికి దరఖాస్తు పోయివున్నది. భోగతోట ప్రక్క కస్తూరిదేవి నగర్‌లోవుండే సుమారు 600 అంకణాల స్థలం ప్లాట్ల క్రింద విక్రయించ బోతున్నారు. 17 తేది జరిగిన కమిటీ మీటింగులో తిక్కవరపు రామిరెడ్డిగారిని అధ్యక్షులుగను, రేబాల దశరథరామిరెడ్డిగారిని కార్యదర్శిగను ఎన్నుకోబడినది. టవును వాసులేగాక జిల్లా వాసులందరు సహాయం చేయవలసిందిగా కోరుచు ప్రార్థన.

### ఇద్దరి విడుదల

అల్లూరు రంగయ్య పెరోలుపై వున్న అల్లూరు వాసి బత్తిని రామకృష్ణారెడ్డి గారలిద్దరిని తంజావూరు జైలునుండి విడుదల జేసిరి.



కృష్ణం కమల పత్రాక్షం పుణ్య శ్రవణ కీర్తనం :: వాసుదేవ జగత్సర్వం నౌమి నారాయణం హరిం

నెల్లూరు మూలాపేటలో వేంచేసియుండు

# శ్రీ వేణుగోపాలస్వామి వారి బ్రహ్మోత్సవములు

## 20.4.94 నుండి 2.5.94 వరకు జరుగును

| తేది | వారము | ఉత్సవములు | బ్రహ్మోత్సవ సాంస్కృతిక కార్యక్రమములు - రాత్రి 7 గంటల నుండి |
|---|---|---|---|
| 22.4.94 | శుక్రవారము | సూర్యప్రభ<br>రా. హంస వాహనము | శ్రీ రాజరాజేశ్వరి నాట్యమండలి చింతోపు వారిచే మోహిని భస్మాసుర అను పౌరాణిక నాటకము ప్రదర్శింపబడును. |
| 23.4.94 | శనివారము | యాళి ఉత్సవము<br>(సింహవాహనము)<br>రా. చంద్రప్రభ | 1. మిమిక్రీ కళాకారుడు శ్రీ కల్లెపల్లి బాలరాజు గారిచే మిమిక్రీ ప్రదర్శింపబడును.<br>2. శ్రీ వెంకటేశ్వర నాట్యమండలి వారిచే<br>సత్యహరిశ్చంద్ర అను పౌరాణిక నాటకము ప్రదర్శింపబడును. |
| 24.4.94 | ఆదివారము | చప్పరము<br>వెండి హనుమంత సేవ | 1. శ్రీ జి. రామమోహన రావు (AIR, విజయవాడ) శ్రీ జి. ఆంజనేయ శాస్త్రి గార్లచే వయొలిన్<br>యుగళము మృదంగం; చి.జి. ప్యాంకృష్ణశర్మ. 2. శ్రీ కల్యాణి ఆర్ట్స్ వారిచే మాయాబజార్ అనుగొప్ప పౌరాణిక నాటకము |
| 25.4.94 | సోమవారము | మోహిని (గిన్నె భిక్ష)<br>గరుడసేవ | 1. శ్రీ ముక్కామల నరశింహారావు. గుంటూరు (AIR ఆర్టిస్ట్) వారిచే సంగీత విభావరి జరుపబడును.<br>2. శ్రీ పి. సుందర రామిరెడ్డి అండ్ ట్రూప్ వారిచే శ్రీ కృష్ణరాయబారము అను పౌరాణిక నాటకం ప్రదర్శింపబడును. |
| 26.4.94 | మంగళవారము | | 1. శ్రీ జొన్నవాడ రామమూర్తి (AIR) అండ్ పార్టి వారిచే సోలోనాదస్వర కచ్చేరి జరుపబడును.<br>2. శ్రీ సరస్వతి కళాసమితి వారిచే శ్రీ రామాంజనేయ యుద్ధం అనుగొప్ప పౌరాణిక నాటకము ప్రదర్శింపబడును. |
| 27.4.94 | బుధవారము | రథము<br>ఏనుగ వాహనము | 1. శ్రీ సంగీత సుధాకర యన్. సూర్యారావు గారిచే గాత్ర కచ్చేరి<br>2. శ్రీ రాజరాజేశ్వరి నాట్యమండలి, చిన్నచెరుకూరు వారిచే బొబ్బిలి యుద్ధము అను నాటకము ప్రదర్శింపబడును. |
| 28.4.94 | గురువారము | వెన్న తాళి ఉత్సవం<br>గుర్రము వాహనము | 1. రంగస్థల నటుడు శ్రీ కె. రామలింగా రెడ్డి గారిచే హాస్య నాటిక.<br>2. శ్రీ సరస్వతి నాట్యమండలి శ్రీ కృష్ణమీరా భక్తి రస నాటిక |
| 29.4.94 | శుక్రవారము | తీర్థవాడి ముసుగుల సేవ<br>పొన్న వాహనము | 1. శ్రీ వొమ్మిన సురేష్ అండ్ పార్టీ చే గొప్ప మ్యూజిక్ షో ప్రదర్శన.<br>2. శ్రీ శ్రీనివాస నాట్యమండలి వారిచే అన్నమాచార్య ప్రదర్శింపబడును. |
| 30.4.94 | శనివారము | అవరోహణము | 1. చిరంజీవులు సౌమ్య రాయర్ మరియు సౌజన్యమూర్తిచే భరతనాట్య ప్రదర్శన.<br>2. శ్రీ నేతాజి నాట్యమండలి చిన్నప్ప ట్రూపు వారిచే బాలనాగమ్మ అను పౌరాణిక నాటకము ప్రదర్శింపబడును. |
| 1.5.94 | ఆదివారము | పడాయత్ - I | 1. యం. హేమకుమారి అండ్ పార్టీచే రాణి రుద్రమదేవి బుర్రకథ గానము చేయబడును.<br>2. భగవాన్ వెంకయ్య స్వామి నాట్యమండలి వారిచే సత్యహరిశ్చంద్ర అను నాటకము ప్రదర్శింపబడును. |
| 2.5.94 | సోమవారం | పడాయత్ - II | కళామందిర్ నెల్లూరు దాశరథిచే భగవద్గీత మరియు కురుక్షేత్రము ప్రదర్శింపబడును.<br>2. నెల్లూరు మూలపేట రసమంజరి ఆర్ట్స్ వారిచే గొప్ప నాటికలు |

కావున భక్తులెల్లరూ విచ్చేసి, శ్రీ స్వామి వారి, అమ్మవార్లను దర్శించి, తీర్థప్రసాదములు స్వీకరించి,
పై కార్యక్రమములను జయప్రదము చేయవలసినదిగా కోరుచున్నాము.

భవదీయులు

## శ్రీ వేణుగోపాలస్వామి వారి వంశపారంపర్య ధర్మకర్తలు

**ఆనం వివేకానంద రెడ్డి,** మేనేజింగ్ ట్రస్టీ

ట్రస్టీలు

ఆనం చంద్రశేఖర రెడ్డి, మన్నెం లక్ష్మీనాథ్ రెడ్డి, తుమ్మల సుబ్బారెడ్డి, మజ్జిగ చంద్రమౌళి రెడ్డి

కె.వి. నారాయణ - మేనేజరు

Edited, Printed and Published by N. ...